# తత్వమసి

## ఇతర నాటికలు

గోపీచంద్



శి ప్రచురణలు

దేశీ ప్రచురణ
ప్రథమ ముద్రణ
ఫిబ్రవరి : 1957
వెల: రూపాయిన్నర




---

సంపాదకులు :

బొందలపాటి శకుంతలాదేవి

శివరామకృష్ణ

ఈ సంపుటిలో:

తత్వమసి

కాలప్రవాహం

విచిత్రప్రక్రియ

విశ్వరూప సందర్శనం

నిలబడిన పరువు

రచ్చబండ

# ప రి చ యం

దీనికి ముందు నేను ప్రచురించిన నాటకం 'మాంచాల'. ఈ నాటకం నేను ఆశించిందానికంటే ఎక్కువ ప్రశంసలను అందించింది. నిజం చెప్పాలంటే తెలుగు పాఠకలోకం, వరుసగా ఇన్ని సంవత్సరాలనుంచీ నన్ను ఎప్పటికప్పుడు తన ఆదరాభిమానాలతో ప్రోత్సహిస్తూనే వుంది. అది నాకిచ్చే ప్రోత్సాహాన్ని తలుచుకుంటే అప్పుడప్పుడూ నన్ను చూచుకొని నేనే సిగ్గు పడుతూవుంటాను ఈ విషయంలో నేను చాలా అదృష్టవంతుణ్ణి అనుకుంటూవుంటాను.

'మాంచాల' నాటకానికి లభించిన ఆదరమే, నన్నీనాటికలు ప్రచురించే సాహసానికి ఒడికట్టేటట్టు చేసింది. మాంచాలకుమల్లే ఈ పుస్తకంలోని నాటికలుకూడా రేడియోకోసం వ్రాయబడ్డవే! రేడియోద్వారా ప్రసారం చెయ్యబడ్డవే! అందువల్ల ప్రదర్శనకు అనసుకూలంగా వుండే లక్షణాలు అక్కడక్కడా కనుపిస్తూ వుంటై.

నేను వేరొక సందర్భంలో నా కథాసంపుటి కొకదానికి పీఠిక వ్రాస్తూ, కథలు వ్రాయవలసిన ప్రత్యేకత నాలో లేదనీ, నేను వ్రాయటం మొదలుపెట్టినప్పుడు కథారచన ప్రజానురంజకంగా వుండటం వల్ల నేను కథలు వ్రాయటం మొదలు పెట్టాననీ ఉదహరించాను. నేనీ విషయం వ్రాసేటప్పుడు నా విద్యార్థిదశ మనస్సులో తళుకు తళుకున మెరవటమే దీనికి కారణం. నా విద్యార్థి దశలో ఇబ్సన్, బెర్నార్డ్‌షా, ఆస్కార్ వైల్డ్ మొదలయిన ఇంగ్లీషు నాటకకర్తలు చాలా ప్రచారంలో వుండేవారు. ప్రతి విద్యార్థి మనస్సుమీదా వారి ప్రభావం, ఎంతవరకో కొంతవరకు, కనుపిస్తూవుండేది. వారి రిపార్టీలు సొంతస్వభావాభిలాషవున్న ప్రతి విద్యార్థి

నోటా నిత్యం వినబడుతూ వుండేవి. ఈ నాటక కర్తలతో ఏదో ఒక విధంగా సన్నిహితత్వం ప్రదర్శించుకోవటం ఆనాడు 'ఫ్యాషన్' గా వుండేది. కాబట్టి నేను ముందుగా చదివింది ఈ నాటక కర్తలనే. ఈ నాటక కర్తలే ముందుగా నా మనస్సుని ఆకర్షించి ఉత్తేజ పరిచారు. ఆనాటి నా రచనల్లో వీరి ప్రభావం చాలా ఎక్కువగా కనపడేది అనటం నిజాన్ని చెప్పటమే. ఇప్పటికీ వీరి ప్రభావం నా రచనల్లో అక్కడక్కడా కనుపిస్తూవుంటుందని కొంతమంది మిత్రులూ, కొంతమంది విమర్శకులూ అంటూవుండటంకూడా నేను ఎరుగుదును.

ఆ రోజుల్లో మాకు, వ్యాస వాల్మీకి కాళిదాసాదులవంటి సంస్కృత కవులుగానీ, రవీంద్రునివంటి ఆధునికులుగానీ మాత్రం నచ్చేవారుకాదు. ఎవ్వరైనా షేక్స్పియర్‌తోపాటు కాళిదాసుని చేర్చినా, బెర్నార్డ్‌షాతోపాటు రవీంద్రుని కలిపినా మాకు హాస్యాస్పదంగా వుండేది. ఇలా ప్రయత్నించటానికి వారి అజ్ఞానమో, లేక వారి సంకుచిత జాతీయతత్వమో కారణం అనుకునేవాళ్ళం. దీనికి కారణం పై కవులను అర్థం చేసుకొని ఆనందించే స్థాయి ఆనాడు మాకు లేకపోవటం కావచ్చు. లేక మొత్తంమీద మన నాగరికతమీద ఆనాడు మాకున్న తేలికభావం కావచ్చు. లేక ఆనాటి మా లేతమనస్సులను బొమ్మ రెండోవైపు కదిలించి వుండవచ్చు.

పాతసాంప్రదాయాలమీద నమ్మకాలు చెడిన రోజులవి. అప్పుడు ఆ నమ్మకాలను అపహాస్యంచేసి, కవ్వించి నవ్వించే రచయితలు మనస్సులను వశం చేసుకోగలగటం సహజం. పైగా బొమ్మకు వొకవైపే వుంటుందనుకునే రోజుల్లో, అకస్మాత్తుగా దాని రెండవవైపుని చూపినపుడు, ఆ చూపినవారి ప్రజ్ఞను కొనియాడబుద్ధి అవటంకూడా సహజమే. మేము ఆ రోజుల్లో బెర్నార్డ్‌షా, ఆస్కార్‌వైల్డ్ మొదలైనవారి ప్రతిభను చూచి ఈ విధంగానే చకితులం అయ్యాం: భ్రమించాం అని ఇటీవల అనిపిస్తూవుంది.

అయితే వారు ప్రతిభావంతులు కాదని నేను చెప్పటంలేదు. మా ప్రత్యేకపరిస్థితులవల్ల ఉన్నదానికన్నా ఎక్కువ ఊహించుకున్నాం, అవి మాత్రమే నేను చెప్పదలిచాను.

మొదట్లో బొమ్మ రెండవవైపు సంపూర్ణసత్యం అనుకొని ఉద్వేగంతో దానివెంట పడ్డా, నెమ్మదిమీద అదికూడా అసంపూర్ణ సత్యమే అనీ, బొమ్మ మొదటివైపులాంటిదే అనీ తెలుసుకున్నప్పుడు మళ్ళీ కొంత చల్లబడి వెనుక ముందులు చూచుకోవటం స్వభావసిద్ధమైన గుణమే. అదే మాకూ జరిగింది.

అప్పుడు మన మనస్సులు 'ఇవన్నీ అర్ధసత్యాలే. వీటన్నిటినీ కలుపుకొని, నిలబడగలిగిన సంపూర్ణ సత్యం వొకటే వున్నది,' అని చెప్పే మన పూర్వసంస్కృతిమీదా పూర్వ కవులమీదకూ ఒక్కసారిగా మళ్ళినయి. ఇక చెప్పవలసిందేముంది? మనవారంతా వొకరి తర్వాత వొకరు మా మనోవీధుల్లో లాస్యం చెయ్యటం ప్రారంభించారు.

ఈ దృష్టితో చూస్తే మన రవీంద్రులవంటి రచయిత నేటి ప్రపంచంలో మరొకరు కనుపించరు. అయితే ఇటువంటి రచయితలకూ, పాశ్చాత్య దేశాల్లో పేరుపొందిన రచయితలకూ ముఖ్యభేదం వొకటి వుంది. కాళిదాస రవీంద్రులవంటి రచయితలు వ్యక్తులుగా గొప్పవారు. మరో పురుషులు. అందువల్ల వారేరూపాన్ని సృష్టించినా అది గొప్పగానే ఉంటుంది. వారు దేన్ని పట్టినా అది బంగారమే అవుతుంది. వారిని మనం సంకుచితపరచి కవిగా గొప్పవాడనీ, నాటక కర్తగా గొప్పవాడనీ, నవలా రచయితగా గొప్పవాడనీ-ఈవిధంగా విభజించి చెప్పలేం. వారు సూర్య గోళంవంటివారు. నిత్యం ప్రకాశిస్తూ వుంటారు. ఆ ప్రకాశం వివిధ రూపాల్లో మనకు అందవచ్చు అంతే. నేను పైన ఉదహరించిన పాశ్చాత్య నాటక కర్తలు అలాకాదు. వారు తమ మేధస్సుని దాటనివారు. ఒక పద్ధతిని నిర్ణయించుకొని తమ మేధస్సును ఆ పద్ధతిలోకి ప్రవహింప జేసిన

వారు. అందువల్ల ఆ పద్ధతిని విభజించుకొని నిర్ణయించుకున్నంత మేరకు వారు తమ అభివృద్ధిని సంకుచిత పరచుకున్నారని చెప్పుకోవలసి వస్తూవుంది.

ఈ రెండురకాల రచయితలకు మరొక భేదంకూడా వుంది....రవీంద్రునివంటి రచయితలు జీవించే జీవితం ముఖ్యంగా మానసిక జీవితం. అందువల్ల వారికి భావాలు ముఖ్యం. అంటే భావాలకు ఆధారమైన అనుభవం వారికి వుండదనీ, అనుభవం వారి రచనల్లో ప్రతిబింబించదనీ, అనుభవం లేకుండా వ్రాయగలరనీ కాదు నా అభిప్రాయం. ఈ భౌతిక ప్రపంచంలో విభిన్నానుభవాలకు వీలున్నది. రవీంద్రునివంటి మానసిక జీవులు ఈ విభిన్నానుభవాలను చిలికి, వీటి అన్నిటినీ కలుపుకు రాగలిగిన వొక భావాన్ని సృష్టించి, ఆ భావానికి అనేక రూపాల నిస్తారు. దీనివల్ల అనుభవం లీలగా ఎక్కడో వుంటుంది. ఈ పద్ధతి విభిన్నానుభవాలను అధిగమించి చూసేశక్తిని ఇస్తుంది. అందువల్ల ఇది సత్యానికి దగ్గర. రవీంద్రుని రచనలనుంచే వొక ఉదాహరణ చూపుతాను.

చచ్చిన పక్షి క్రింద పడుతుంది. చెడిన విమానం క్రింద పడుతుంది. ఎగరవేసిన రాయి తిరిగి కిందకు వస్తుంది. రాలినపండు కింద పడుతుంది. ఎందుకని? దేనికదే పరీక్షిస్తే ఎన్నోచిక్కులు వస్తాయి. ఎంతోకాలం పడుతుంది. ఎంతో చీకాకు కలుగుతుంది. కాని 'భూమ్యాకర్షణ' అనే సూత్రాన్ని కనుగొన్న తర్వాత చిక్కులన్నీ తేలిగ్గా విడిపోతయి. ఈ సూత్రంద్వారా ఇంకా అనేక విషయాలు మనకు అందుబాటులోకి వస్తవి. విభిన్న అనుభవాల, అనేకంగా కనపడే అనుభూతుల, సారాంశాన్ని పిండగలగటంవల్ల వచ్చే సౌలభ్యం ఇది. ఈశక్తి రవీంద్రునికి ఉన్నది. అందువల్ల ఆయన సత్యానికి చేరువగా ఉన్నట్లు అనిపిస్తాడు, కనిపిస్తాడు.

పాశ్చాత్యులకు ఈశక్తి తక్కువ. అందువల్ల వారు తమకు అందు బాటులోవున్న వొకరకం అనుభవానికే రూపాన్నిస్తారు. అందువల్ల ఎంత తెలివిగా, బలంగా, అందంగా చెప్పినా అది అర్ధసత్యం, అసంపూర్ణమే అవుతుంది. వారు చెప్పినంతవరకు అది నిజమే. కాని అది సంపూర్ణ సత్యంకాదు. విద్యార్థి దశలో మమ్ములను ఊపి ఉద్రేకపరచిన పాశ్చాత్య రచయితల స్థితి ఇదే. అందువల్లే బెర్నార్డ్‌షాని గురించి శ్రీ అరవిందులు, 'అతను సత్యాన్ని కొంతవరకే తెలుసుకోగలిగాడు' అన్నారు.

*　　　　*　　　　*

ఈ పుస్తకంలోని నాటికలు నేను బెర్నార్డ్‌షానుంచి రవీంద్రుల వరకూ ప్రయాణం పూర్తిచేసిన తరువాత వ్రాసిన నాటికలు. ఈ నాటికలను సహృదయంతో చదివి నిష్పక్షపాతంగా వొక అభిప్రాయాన్ని ఏర్పరచుకోటానికి నా పరిణామం దాని పర్యవసానం కొంతవరకు చదువరులకు తెలియటం అవసరం అనే వుద్దేశంతో పై విషయాలు చెప్పాను.

ఇక దయచేసి చదవండి.

నూతాశ్రమం.

—గోపీచంద్

"...Man has a feeling that he is truly represented in something which exceeds himself. He is aware that he is not imperfect, but incomplete. He knows that in himself some meaning has yet to be realised."

—Tagore.

*The Religion of Man*

పాత్రలు:

నేను

ప్రభుత్వం

ప్రకృతి

సంస్కారం

యంత్రం

ప్రజలు

# తత్త్వమసి

మ : నేను పురుషుడను. ఆమె ప్రకృతి. నాకు హృదయం వుంది. ప్రకృతికి లేదు. ప్రకృతికి హృదయం లేదంటే సుఖదుఃఖాలకూ, రాగ ద్వేషాలకూ, అతీతమనుకో కూడదు. ప్రకృతికి సుఖదుఃఖా లున్నాయి. రాగ ద్వేషాలున్నాయి. రాగ ద్వేషాలకూ, సుఖ దుఃఖా లకూ భిన్నంగా ప్రకృతి లేదు. ఆమె వుండి వుండి కుంభవృష్టిగా శోకిస్తుంది. ఫెళ ఫెళార్భాటంగా కోపి స్తుంది. వెన్నెల జల్లుగా మారి లాలిస్తుంది. ఆనంద స్వరూపమైన నవ్వులు వలకబోస్తుంది. కాని ఆమెకు హృదయం లేదు. మంచి లేదు. చెడు లేదు. నిర్దా క్షిణ్యంగా తన పని తాను చేసుకుపోతుంది. ఆమె నవ్వేట, శోకించేది, లాలించేది, కోపించేది నా' కోసం కాదు. ఎవరికోసం కాదు. తనకోసం కూడా కాదు.

అది ఆమె స్వభావం.
ఆమె స్వభావం శిలా శాసనం.
దానికి మార్పు లేదు. మాపు లేదు.

ఆమె నిరంకుశ స్వభావాన్నుంచి, నే నెలా బ్రతికి బయటపడ్డానో నాకే తెలియదు. వెనక్కి తిరిగి చూసుకుంటే యిప్పటికీ నా గుండె దడదడ కొట్టు కుంటుంది. ఆమె భూకంపాన్ని సృష్టించుకుని హృద యాన్ని బ్రద్దలు కొట్టుకుంది. నేను భూకంపాలలోని

కంపాన్నై బ్రతికాను. ఆమె అగ్నిజ్వాల లెగ జిమ్మింది. నేను అగ్నిజ్వాలలకు శిఖనై కూర్చు న్నాను. ఆమె వరదగా మారింది. నేను నురుగునై తప్పించుకున్నాను. ఆమె పుష్పిన రూపం ధరించింది. నేను గడ్డిపోచనై తల వొగ్గి బ్రతికాను.

ఆమె బెదరింపులనుంచి, నిరంకుశ చర్యలనుంచి తప్పించుకోవటమే నాకు పరమావధి అయింది. స్వీయ రక్షణకై నేను చేసిన కర్మలు నాకు అనుభ వాన్నిచ్చినయి. నాకు జ్ఞానం కలిగింది. ఇప్పుడు ఆమె నుంచి తేలిగ్గా తప్పించుకోగలను.

[బైట రివ్వున గాలి వీస్తుంది. ఉరుములు, మెరుపులు మధ్య మధ్య చెట్లు విరిగిన, ఇండ్లు కూలిన ధ్వనులు. అతని కెదురుగా ప్రకృతి అవతరిస్తుంది...............]

ప్రకృతి : నేను ప్రకృతిని. నాకు భిన్నంగా పంచభూతాలు లేవు. నీవొక క్షుద్రజీవివి. పంచభూతాల శక్తినుంచి తప్పించుకోలేవు. నా నుంచి నిన్ను నీవు రక్షించుకో లేవు. నా పరిణామాన్నుంచి, తత్ఫలితమైన సంఘర్ష ణల నుంచి, నాశనాన్నుంచి నిన్ను నీవు రక్షించు కోవాలని ప్రయత్నిస్తున్నావు. ఆ ప్రయత్నంలో నా పరిణామానికి విరుద్ధమైన ఆలోచనలనూ, మన స్తత్వాన్ని, సంస్కారాన్ని నాగరికతనూ సృష్టించు కుంటున్నావు. ఈ లోకంలో నా పరిణామమే శాశ్వతం. అందుకు దోహదమివ్వటమే జీవకోటికి ఆనందం. విషయ వాంఛల్లో చిక్కుకుని, నా నాటికీ

నీవీ ఆనందానికి దూరమవుతున్నావు. ఈ ఆనందానికి వ్యతిరేకమైన క్షుద్ర సంతోషాలను సృష్టించుకుని ఆత్మ ద్వేషివై ఆత్మహత్యకు పూనుకుంటున్నావు.

[ప్రకృతి ఉరుముతుంది. పిడుగు పడిన ధ్వని. సముద్ర ఘోష. గాలి హోరు. దూరాన్నుంచి మానవుల ఆర్తనాదం- సింహగర్జన]

నేను : నీ శక్తి అనంతం. తృటిలో జీవకోటినంతా నాశనం చేయగల్గిన, నీ భయంకరమైన శక్తి అప్రతిహతం. నీ శక్తినుంచి తప్పించుకునే ప్రయత్నంలోనే నాకూ జ్ఞానం వచ్చింది. నాకు కలిగిన యీ జ్ఞానాన్ని నీ నుంచి నన్ను నేను రక్షించుకోటానికే వినియోగించుకుంటున్నాను. కాని అనంతమైన, అత్యద్భుతమైన, అపురూపమైన నీ శక్తిని యెదిరించి నీ పరిణామానికి వ్యతిరేకంగా మరో సామ్రాజ్యాం నిర్మించాలని నా ఆశయం కాదు. నేను బ్రతకటం ముఖ్యం. అందుకవసరమైన అలవాట్లను, మనస్తత్వాన్నీ సంస్కారాన్నీ నాగరికతనూ అలవరచుకున్నాను. జ్ఞానం నా స్వలాభ ప్రయత్నంలోనే ఉద్భవించినా, నీ స్వభావాన్ని అర్థం చేసుకుని నిన్ను జయించి నీకూ నాకూ స్పర్థ లేకుండా చేసుకుని నీతోపాటు పరిణామం చెందుతూ, నీ పరిణామానికి దోహదమిస్తూ సచ్చిదానందాన్ని పొందాలనే నా ఆశయం. అందుకు యంత్రాలను కనిపెట్టాను. సంస్కారాన్ని సృష్టించాను. బుద్ధి బలాన్నుపయోగించి అనేక దారులు వెతుకుతున్నాను.

ప్రకృతి : నీ జ్ఞానం సంకుచితం. సంకుచితమైన జ్ఞానాన్నుంచి సంకుచితమైన సాధనాలనే సృష్టించ గల్గుతున్నావు. శక్తి స్వరూపిణినైన నన్ను సంకుచిత సాధనాలతో జయించటం సాధ్యమని తలుస్తున్నావు. నాలో బీజ రూపంగా వున్నవాటిని వృద్ధిచేసి వాటి ద్వారా నన్ను జయింపగల ననుకుంటున్నావు. కాని అది అసాధ్యం. అస్వాభావికం. ఈ అస్వాభావిక ప్రయత్నంలో నీవు సృష్టించిన సాధనాలు తమ ఆదర్శాన్ని నెరవేర్చుకోలేక నీకే యెదురు తిరిగి, బంధ విమోచనకై నీ చేత సృష్టింపబడ్డ అవి నీకే బంధాలవుతున్నాయి. తమ యినుప కౌగిళ్ళలో నిన్ను చేర్చుకుని విషధారలు పోస్తున్నాయి. నీకు మరణం తప్పదు. చూడు నీవు సృష్టించిన శక్తులే నిన్నెలా ముసురుకుంటున్నాయో ?

[ ఒక ధ్వని-ఒక యింజను పొగ విరజిమ్ముతూ చేసినధ్వని. ఒక యంత్రాగారంలో అనేక యంత్రాలు చేస్తున్న ధ్వని. విమానం మోత. యంత్రాలు పురుషరూపంలో అవతరిస్తాయి]

యంత్రం : నేను యంత్రాన్ని. మానవుని ఉపయోగార్థం జన్మించాను. మానవుణ్ని ప్రకృతి నుంచి రక్షించటానికి, ప్రకృతిని మానవుని వుపయోగార్థం వినియోగించటానికి జన్మించాను. మానవుని అభివృద్ధికై అవసరమైన ప్రకృతి పదార్థాలను మానవునికి అందించటం నా కర్తవ్యం. ఒక ప్రక్క ప్రకృతీ, ఒక ప్రక్క మానవుడు, మధ్య నేను. ఈ రెండు శక్తు

లను సమన్వయం చెయ్యటానికి పుట్టిన నేను మరొక శక్తిగా వృద్ధిచెందాను. నేను నే నే. ఉపయోగం-నిరుపయోగం నాకు లేవు. అవి మానవ కల్పితాలు. అభివృద్ధీ నాశనం రెండూ నాకు ఒక్కటే. మానవునివల్ల పుట్టిన నేను మానవుని లోబరచుకున్నాను. మానవుడు నాకు బానిస. అత డిపుడు తన అభివృద్ధికి ఉపయోగమైన పనులు నాతో చేయించుకోవటం లేదు. నా స్వభావానికి అవసరమైన పనులు నే నే అతనితో చేయించుకొంటున్నాను. ఇందుకు అనుకూలమైన దృష్టి అతనికి కలిగించాను. ఇందు కనుకూలంగా మన స్తత్వం మార్చాను. ఇందు కనుకూలమైన పనులే యిప్పుడు తను చేస్తున్నాడు. నేను అహోరాత్రుళ్ళు ప్రకృతిని మథిస్తున్నాను. కాని ఒక ప్రక్కన ధనరాసులు, ఒక ప్రక్కన దారిద్ర్యం, ఒక ప్రక్కన కేరింతలూ, ఒక ప్రక్కన హాహాకారాలు -నాకు వీటితో నిమిత్తం లేదు. నాకు పనియెక్కువైన కొద్దీ ఆకలి యెక్కువవుతూ వుంది. నేను బయల్దేరుతున్నాను. ప్రకృతినీ మానవుణ్ణీ సర్వనాశనం చేస్తాను. విశ్వాన్నంతా మింగుతాను. నే నే సర్వాధికారి నవుతాను.

[యంత్రం ప్రవేశించినప్పటికంటే పెద్ద ధ్వనులు చేసుకుంటూ నిష్క్రమిస్తుంది....]

ప్రకృతి : చూశావా. ఎవరి సహాయంతో నన్ను నీ స్వార్థానికి ఉపయోగించుకోవాలని అభిలషించావో ఆ

యంత్రం యెటువంటి వికృత రూపం ధరిస్తూ వుందో! ఈ యంత్రం నన్ను జయించదు. పైగా నిన్ను సర్వనాశనం చేస్తుంది. ఇక నీ మిడిమిడి జ్ఞానంలో నుంచి జనించిన సంస్కారాన్ని చూడు.

[మృదు మధురమూ, అతి నవ్యమూ అయిన సన్నని సంగీతం వినిపిస్తుంది. మధ్య మధ్య ఆ సన్నని ధ్వని నుంచి చిందుతూ వున్న అలల తాకిడి వినిపిస్తూ వుంది. ఆ ధ్వనిలోనుంచి సుకుమారమైన స్త్రీ మూర్తి ఉద్భవించి పురుషునికి యెదురుగా నిలబడుతుంది. ఆమె వదనంమీద విషాదచ్ఛాయలు కనిపిస్తో వుంటాయి. తేజోవంతములైన ఆమె నయనాలు అర్ధనిమీలితంగా వుంటాయి. ఒక నిట్టూర్పు వినిపిస్తుంది. ఆమె అంటుంది..........]

సంస్కారం : నేను సంస్కారాన్ని.

ప్రకృతి : అవును, ప్రజలకు అనిర్వచనీయమైన ఆనందాన్నిచ్చి వాళ్ళ జీవితాలను కల్మషరహితం చేసి ఉన్నత పథాలకు తీసుకొని పోవలసిన దానివి. నీవే కన్నీరు పెట్టుకుంటున్నావేం ?

సంస్కారం : నన్నందరూ తమ స్వార్థానికి వినియోగించు కుంటున్నారు. నామాట ఒక్కరూ వినటంలేదు. నన్ను పరాయిదాన్నిగా చూస్తున్నారు. సృష్ట్యాది నుంచి నే నుంటున్నాను. ప్రకృతిలో గూఢంగా వున్నాను. ప్రకృతిలోనుంచి చైతన్యం బహిర్గతమైనప్పుడు చైతన్యంలో గూఢంగా వున్నాను. చైతన్యం పరిణామం చెంది జ్ఞానాన్ని సంపాదించినపుడు నేను

బహిర్గతమయ్యాను. నే నకస్మాత్తుగా ప్రవేశించి ప్రజల జీవితాలలో జోక్యం కలిగించు కుంటున్న దాన్ని కాదు. అనాదినుంచి వుంటునే వున్నాను. మానవుడు ప్రకృతిలో వున్న కొన్ని శక్తుల్ని గ్రహించ గలిగాడు. ఆ శక్తులే మానవ పరిణామానికి ముఖ్య మనుకొంటున్నాడు. మానవులు తెలుసు కొన్న శక్తులు తెలుసుకోలేని శక్తులు—ప్రకృతిలో వున్న మొత్తం శక్తుల ఫలితాన్ని నేను. అందువల్ల నే మానవులకు నేను అతీతంగా కనిపిస్తాను. కాని ప్రకృతి పరిణామంనుంచి మానవుడు పెడదారి పట్ట కుండా వుండాలంటే నేనే అవసరం. ప్రకృతిలోవున్న శక్తుల ఫలితాన్ని నేనవటం వల్ల నేను దారి చూప గలను. మహాఋషులు నా మహాత్మ్యాన్ని గ్రహించి నాకు ప్రోత్సాహ మిచ్చారు. మానవుడు కూడా ప్రకృతిలో భాగమే అవటంవల్ల, ప్రకృతిలో ఉన్న శక్తులూ, ప్రేరేపణలూ అన్నీ మానవునిలోఉన్నాయి. కొన్ని శక్తులు నిద్రావస్థలో వున్నాయి. మొత్తం శక్తుల ప్రేరేపణ ఫలితమే మానవ పరిణామమని గ్రహించి, తపస్సమాధిలో, నిద్రణావస్థలో వున్న శక్తులను ప్రేరేపణ కలిగించారు, మహర్షులు. తత్ఫలి తానికి ఒక స్వరూపమిచ్చారు. ఆ స్వరూపాన్ని నేనే.

కాని మానవులు నన్ను గుర్తింపలేకుండా వున్నారు. అర్థ కామాలకు లోబడి మానవులకు నేను అనవసరమైన ఊహగా కన్పిస్తున్నాను. నన్ను వారు

శత్రువుగా పరిగణిస్తూ వున్నారు. ధనవంతులకూ నిరుపేదలకూ జరిగే సంఘర్షణలో నేను నలిగిపోతున్నాను. నాకీ ప్రపంచంలో స్థానం లేదు. నాకు స్థానంలేని ప్రపంచానికి మోక్షంలేదు.

[వెయ్యి తంత్రీలు అకస్మాత్తుగా తెగినధ్వని. విషాదాన్ని సూచించే సంగీతం. నెమ్మదిగా సంస్కారం నడిచివెళ్ళిపోతూ వుంటుంది. నిట్టూర్పులు, ఆమె విచారాన్ని సూచించే యితర ధ్వనులు, అన్నీ క్రమేణా అంతరిస్తాయి.]

ప్రకృతి : ఇప్పుడే మంటావు ? ఏశక్తులతో నన్ను జయించాలనుకున్నావో ఆ శక్తులన్నీ నిస్పృహ చెంది చెదిరిపోతున్నాయి. వాటి సహజ పరిణామం అరికట్టబడటంవల్ల తమ కర్తపై వేయి నాల్కలు చాస్తున్నాయి.

[తుపాకులు పేలిన ధ్వని, ఫిరంగుల మోత,
మానవుల కేకలు, మిలిటరీ బ్యాండు.]

ప్రకృతి: ఇక దుష్ట శిక్షణకు శిష్టరక్షణకుగాను నీవు నియమించిన ప్రభుత్వం వస్తూవుంది. చూడు, మానవ సంఘంలో న్యాయం జరగటానికి గదా నీవు దాన్ని నిర్మించింది. నిర్మాణానంతరం దాని ప్రవర్తన ఏ విధంగా వుందో చూడు.

[తుపాకులు పేలినధ్వని, ఫిరంగుల మోత, మానవుల కేకలు, మిలిటరీ బ్యాండు, ప్రభుత్వం రాక్షసరూపంలో వికటాట్టహాసం చేసుకుంటూ మానవుని కెదురుగా నిలుచుంటుంది.]

ప్రభుత్వం : నేను ప్రభుత్వాన్ని. నన్ను మానవుడే సృష్టించాడు. మానవుడిలో నీతి, ధర్మం, పతనం కాకుండా చూస్తూ వుండమనీ మానవ పరిణామానికి దోహదంచేసే శక్తులకు సహాయం చేయమనీ మానవుడు ఆదేశించాడు. కాని నా అంత నేనే బ్రతికే స్థితికివచ్చాను. ఒకరికోసం నేను బ్రతకను. నాకోసమే నేను బ్రతుకుతాను. నేను బ్రతకటం నాకుముఖ్యం. అందుకు అవసరమైన పనులన్నీ చేస్తాను. నన్ను కూలదోయ్యాలనే ప్రజలను హతమారుస్తాను. మానవులందర్నీ నాశనం చేస్తానుగాని, నా అధికారం నేను వదలుకోను. నాకు ఆయుధాలున్నాయి, నా చేతుల్లో సైన్యమున్నది. ప్రజలను దగ్గరకు రాబట్టుకునే అధికార ముంది. నాకు నేనే అధిపతిని. న్యాయాన్ని. ధర్మాన్ని అన్నింటిని నాకోసమే ఉపయోగించుకుంటాను.. నేను ప్రపంచాధిపతిని.

[తుపాకి పేలిన ధ్వని, ఫిరంగుల మోత, మానవుల ఆర్తనాదాలు, వీటిని మించిన ప్రభుత్వ వికటాట్ట హాసం, అన్నీ క్రమక్రమంగా దూర మవుతాయి]

ప్రకృతి : నీవు నన్ను జయించలేవు. నీ ప్రయత్నం వ్యర్థం. నామాట విను.

నేను : నీవు చెప్పినది నిజమే. నాచేత నిర్మింపబడిన సంస్థలన్నీ మానవాభివృద్ధికి ఆటంక పరిచేవిగా తయారైనవి. కాని వాటిని నేను నిర్మించినపుడు వాటి

అవసరం వుంది. కొంతవరకు మానవాభ్యుదయానికి తోడ్పడి యిప్పుడు స్వయంపోషకంగా వుండటానికి ప్రయత్నిస్తూ వున్నాయి. లోకాన్నంతా తమ అధికార ప్రాబల్యంకోసమే వినియోగించుకుంటున్నాయి. కాని ప్రజలకు నిర్మాణ కౌశలమేకాదు; నాశనం చేసే శక్తికూడా వుంది.

ప్రకృతి : ప్రజలూ నీమాట వినరు. ఆకలితో మలమల మాడుతూవున్న ప్రజలకు ఆకలి తీర్చుకోవటమే ముఖ్య సమస్య అయిపోయింది. దారిద్ర్యంవల్ల, యీర్ష్యతో, అసూయతో అజ్ఞానంతో బాధపడుతున్న ప్రజలకు నీ ధర్మోపన్యాసాలు తలకెక్కవు. చూడూ – తాము నిర్మించిన యంత్రాల్నే తమ దారిద్ర్యానికి కారణమనే భ్రమతో ఎట్లా నాశనం చేస్తున్నారో !

[దూరంగా యంత్రాలు విరిగి కూలిన ధ్వని, ప్రజలకేకలు.]

వారి కసి అంతటితో తీరలేదు. ప్రభుత్వం మీాది కెక బ్రాకుతున్నారు. కనుపించిన ఏ ప్రాణినీ వూరికనే వదలటం లేదు. తాము దారిద్ర్యంతో వుండగా, సుఖిస్తూవున్న ప్రతి వ్యక్తినీ హింసిస్తున్నారు. ధర్మం లేదు, న్యాయం లేదు, నియమంలేదు. అసురవృత్తి స్వైరవిహారం చేస్తూవుంది.

[దూరంగా ప్రజలకేకలు, ఆర్తనాదాలు,
'అన్నం' 'అన్నం' 'ఆకలి' 'ఆకలి']

అదుగో సంస్కార కాంత. ప్రజ లామెను వెన్నాడుతున్నారు. 'నీవే మా దారిద్ర్యానికి కారణం' అంటున్నారు. 'తియ్యని మాటలు చెప్పి మమ్మల్ని మోసంచేసి మా శత్రువుల అండను చేరావు' అని కోపావేశంతో తరుముతున్నారు. కత్తులు తిప్పుతున్నారు. విను ఆమె ఆక్రందన;

సంస్కారం : (దూరంగా) నేను మీ నేస్తాన్ని. మీ కోసమే జన్మించాను. నన్ను రక్షించి మిమ్మల్ని రక్షించు కోండి. నేను లేనినాడు మానవజాతే లేదు. నేను మీకోసమే బ్రతుకుతూ వున్నాను. రక్షించండి. రక్షించండి.

ప్రకృతి : ఆమె మొర యెవ రాలకిస్తారు?

[దూరంగా ప్రజల కేకలు]

ఆమెను తరుముతూ వున్నారు. మానవలోకాన్ని దాటి, మహారణ్యాన్ని దాటి, కొండలు – గుట్టలు దాటి వెడుతూ వుంది ఆమె.

ప్రజలు : (కొంచెం దగ్గరగా) చంపండి. పొడవండి.

ప్రకృతి : ఆమెయిటే వస్తూవుంది. నీ ఆశ్రయాన్ని అపేక్షిస్తూ వుంది.

[సన్నని విషాదభరితమైన సంగీతం. దడ దడ లాడుతూ సంస్కారం ప్రవేశిస్తుంది.]

సంస్కారం : (తత్తరపాటుతో) ఈ ప్రజలను రక్షించండి. ఆహార నిద్రాదులే జీవితంగా గడిపిన మృగదశ

నుండి వీరిని మానవులుగా తయారు చేసింది నేను. ప్రపంచంలో మానవకోటికి మహదానందాన్నిచ్చే సౌందర్యాలను, ఆకర్షణాలను, ఆనందాలను, అను భూతులను కలిగించింది నేను. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాల నుండి వీరిని కాపాడు తున్నది నేనే. చెడదారుల నుంచి తప్పించి మానవ కోటిని దాని గమ్యస్థానానికి చేర్చే విలువలను సృష్టిం చింది నేను. అటువంటి నన్ను నిర్మూలం చేసి తిరిగి మృగ దశకు వెళ్ళి తమ్ముతాము-నిర్మూలం, చేసు కుందా మనుకుంటున్నారీ మానవులు. వీరిని రక్షించండి.

ప్రజలు : మాకు అన్నం కావాలి. ఆకలి తీరాలి. ఆకలి తీర టానికి యే పనైనా చేస్తాము. ఆకల్ని తీర్చే పను లే పనులైనా మంచివే. ఆకల్ని తీర్చలేనివన్నీ చెడ్డవే. మా దృష్టి అన్నంమీద లేకుండా నువ్వు చెదర గొడుతున్నావు. ఆకలి తీర్చుకోటానికి అనేక నియ మాలు సృష్టిస్తున్నావు. ముందు నిన్ను హతమార్చి స్తేనేగాని మాకు ఆకలి తీరే అవకాశం దొరకదు. నరకండి. పొడవండి. చంపండి (గగ్గోలు)

నేను : ఆకలి తీరవలసిందే. ప్రపంచంలో వున్న యే ఒక్క మానవుడూ ఆకలితో బాధ పడకూడదు. "అన్నం పరబ్రహ్మం". వాయువూ, జలమూ మొదలైన పదా ర్థాల లాగే అన్నం కూడా ముఖ్యావసరం. కాని ఏదో ఒక విధంగా అన్నం సంపాదించటమే మానవుని

పరమావధి కాదు. మన శత్రువుల మనస్తత్వం అది. ఏదో ఒక విధంగా డబ్బు గడించటమే వారి పరమావధి. మనం కూడా అటువంటి కోరికనే కోరితే వారిని ద్వేషించటంలో అర్థం లేదు. ధర్మయుద్ధం చేసి అన్నం అందరికీ దొరికే సదుపాయం చెయ్యాలి. ఏ పరిస్థితులలోనూ దయా సత్య శౌచాలను విడిచి పెట్టరాదు. అన్నం కావలసింది మనకే కాదు, అందరికీని; ఈనాటికే కాదు. ఏనాటికీని, అనే విషయం మరచిపోరాదు. కాని మన పరమావధి దుఃఖ నివృత్తి. సుఖప్రాప్తి. అన్నానికి ప్రాముఖ్యత యీ గమ్యస్థానాన్ని చేరటానికి శక్తి నిచ్చేవరకే.

ప్రజలు : అన్నమే ముఖ్యం. అన్నమే కావాలి. మా ఆకలి తీరాలి. ఈ జ్ఞానం, యీమాటలూ, యీసంస్కారం పోతేగాని మేము బాగుపడం. నీతి, ధర్మం యివన్నీ మమ్మల్ని మోసం చెయ్యటానికి చెప్పే మాటలు. యీ సంస్కారం నశించాలి.

సంస్కారం : ప్రజలను రక్షించండి. ప్రజలు లేని నేను లేను. నేను లేని గమ్యస్థానం లేదు.

నేను : నీవు నా హృదయంలో చేరు. మానవుడీ ప్రపంచంలో వున్నంతకాలం నీవూ వుంటావు.

[ సంస్కారం అతని హృదయంలో చేరినట్లు సన్నని శ్రావ్యమైన సంగీతం బైలుదేరి-వృద్ధిచెంది క్రమక్రమంగా అంతరిస్తుంది. ]

ప్రజలు ; దానికి నీ హృదయంలో స్థానమిచ్చావా ?

నేను : అవును. ఈ సంస్కారం, అనేక యుగాల్నించి పెరిగిన యీజ్ఞానం, యీవైభవం—అన్నీ వుండవలసిందే. ఇవి అందరి అనుభవంలోకి వచ్చేటట్లు మనం ప్రయత్నించాలిగాని వీటిని నాశనం చేసినాక ప్రపంచాన్ని సర్వమంగళం చేసినాక, మనకు భోజనం దొరికేం? దొరక్కేం? నా మాట వినండి. సక్రమమైన పద్ధతులలో మీ వుద్రేకాలను నడపండి. ప్రపంచంలో వున్న దివ్యభోగా లన్నింటికీ అధిపతులుకండి.

[ప్రజలు చంపండి. పొడవండి. అని కేకలు పెట్టుకొంటూ అతని మీదకు వెళ్తారు. ప్రకృతి ప్రజలను వెళ్ళిపొమ్మని ఆజ్ఞాపిస్తుంది. ప్రజలు దిగులుగా వెళ్ళిపోతూ వుంటారు.]

ప్రకృతి : (వికటాట్టహాసంతో) నా నుంచి నువ్వు తప్పుకోలేవు. ప్రజలు నాశనం చెయ్యగా మిగిలిన వాటిని నేను నాశనం చేస్తాను. నిన్ను ... నీ హృదయంలో వున్న సంస్కారాన్ని ... ...

[హోరున వీస్తున్న గాలిధ్వని. ఉవ్వెత్తుగా వేస్తున్న సముద్రపు ఘోష. తుపాను. విరిగికూలుతున్నచెట్లఫెళఫెళార్భాటాలు, మధ్యమధ్య మేడలుకూలిన శబ్దాలు. ఉరుములు పిడుగులు, మధ్య మధ్య ప్రజల హాహాకారాలు]

ప్రకృతి : సర్వనాశన మయింది. ఇక నీవూ, నీహృదయంలో వున్న సంస్కారమూ మిగిలారు. మీ నాశనంతో యిక నేనే మిగుల్తాను.

నేను : నాకు నాశనం లేదు.

ప్రకృ : నీమీాద పిడుగులవర్షం కురుస్తాను.

నేను : నేను సూదంటురాయినై బ్రతుకుతాను.

ప్రకృ : నేను వరదనై నిన్ను ముంచుతాను.

నేను : నేను తెప్పనై తేలిపోతాను.

ప్రకృతి : నేను అగ్నినై నిన్ను దహిస్తాను.

నేను : పొగనై తప్పుకుంటాను.

ప్రకృతి : నాశక్తి అనంతం. నిన్ను నిర్మూలం చేస్తాను.

నేను : నీ ప్రభావం నేను అంగీకరిస్తున్నాను. నీ అనంతశక్తిని గ్రహించటానికే నేను సృష్టించిన సాధనాలను ఉపయోగిస్తాను. నా విషయ వాంఛల సిద్ధికోసం కాదు. నీ అభివృద్ధే నా అభివృద్ధిగా చేసుకుంటాను. ద్వంద్వ రహితుడ నవుతాను.

ప్రకృతి : నీ నాశక్తిని పొందకముందే రూపుమాపుతాను.

నేను : అది నీవల్ల కాదు. నీ వుండగా నేను లేకుండాపోను. నే నెవరిని? నీవే. నీవే అభివృద్ధిపొంది నాదశకు వచ్చావు. ఒకప్పుడు చేతనారహితంగా వున్న నీకే చేతనం వచ్చింది. ఒకప్పుడు జ్ఞానరహితంగా వున్న నీకే జ్ఞానం కలిగింది. నీకు కల్గిన జ్ఞానంతో సుఖ దుఃఖాలను ఏర్పరచుకున్నావు. నీకు కల్గిన జ్ఞానంతో ఆత్మ పరిశోధన చేసుకుంటున్నావు. నీకు కల్గిన జ్ఞానంతో నీ పరిణామానికి అవరోధం కలిగించే దుష్ట శక్తుల్ని నిర్మూలించ[illegible] కల్గిన జ్ఞానంతో సుఖప్రాప్తికీ, దుఃఖ[illegible] యత్నిస్తున్నావు. ఆ గమ్యస్థానాన్ని చేరటానికి అవసరమైన [illegible]

శక్తులను నీకు కల్గిన జ్ఞానంతో నీవే ప్రేరేపించుకొంటు న్నావు. నీ వుండగా నేను లేకుండాపోను. నేను లేకుండా నీవు లేవు. నేనే ప్రకృతిని, నేనే మానవుడను. నాశనమైంది నేనే. నాశనంచేసిందీ నేనే. దుష్టశక్తులను అణచుకునేది నేనే. పరిణామానికి దోహదమిచ్చే శక్తుల్ని ప్రేరేపించుకునేదీ నేనే. దారినిచూపుతున్నదీ, దారిని చూపించుకుంటున్నదీ నేనే. గమ్యస్థానాన్ని నేనే. గమ్యస్థాన సాధకుడను నేనే. సర్వమూ నేనే.

[పక్షుల కిలకిలా రావాలు, కోయిల కుహూ కుహూ రవాలు, శ్రీకృష్ణుని వేణుగానం వినబడుతుంది. ఆ వేణుగానంలో నుంచి పుట్టి యీశ్లోకం దశదిశలనుండీ మారుమ్రోగుతుంది:
యచ్చాపి సర్వభూతానాం । బీజం తదహమర్జున ।
నతదస్తి వినాయత్స్యా । న్మయాభూతం చరాచరమ్.]

—....—

## పాత్రలు:

విశ్వామిత్రుడు

వశిష్టుడు

నారదుడు

దూర్వాసుడు

కాలప్రవాహం

దేవతలు.

# కాలప్రవాహం

సూత్రధారి : ఒకరోజు దూర్వాసమునికి మనస్సు మనస్సులో లేదు. మబ్బుల్లో వనవిహారం మొదలు పెట్టాడు. నడిచాడు, నడిచాడు. ఎతతదూరం నడిచిందీ, ఎటు నడిచిందీ తనకే తెలియదు. అకస్మాత్తుగా, ఎదురుగా కాలప్రవాహం ప్రత్యక్షమయింది.

[సముద్రం ఘోష దూరంగా మొదలై దగ్గరకు వచ్చే టప్పటికి పెద్దదవుతుంది. ఒక్కసారి విరుచుకు మీద పడు తున్నట్టు ఉరుముతుంది; కాసేపు వట్టి ఘోష.........]

కాలప్రవాహాన్ని చూసేటప్పటికి దూర్వాసముని ఆశ్చర్యభరితు డయ్యాడు. ఇటువంటి ప్రవాహాన్ని అతడు యింతకుముందు ఎన్నడూ చూచి ఎరుగడు. వెంటనే దీని సంగతి తెలుసుకోవాలను కున్నాడు.

దూర్వాసుడు : ఎవరునువ్వు? (కాల ప్రవాహం ఘోష) ఎవరవు? (ఘోష) విచిత్రంగా ఉంది. ఏమిటి అం టుంది? ఎందు కింత కల్లోలపడుతుంది? ఎక్కడి కీ ప్రయాణం?

దూర్వాసుడు : నారదా, నారదా!

[దూరంగా గానం. క్రమక్రమేణా దగ్గరకు వొస్తుంది. నారదుడు ప్రత్యక్షం అవుతాడు]

నారదమహామునీ?

నారదుడు : ఏమిటి?

దూర్వాసుడు : ఆశ్చర్యం! ఆశ్చర్యం!!
నారదుడు : ఏమిటా ఆశ్చర్యం దూర్వాసోమునీ?
దూర్వాసుడు : అటుచూడు. ఎవరది? ఎవరికోసం ఈ ఆరాటం? ఎక్కడికీ పరిగెత్తటం?

[ అలలు విరిగినై ]

దూర్వాసుడు : ఏమిటది? ఎవరది?
నారదుడు : [నవ్వి] దీన్ని మీరు ఎరుగరా?
దూర్వాసుడు : ఎరుగను. స్వర్గంలో మందాకిని వుంది. నరకంలో ఉంది వైతరణి. మందాకిని ఉలకదు–పలకదు. వైతరణి కదలదు – మెదలదు. ఇదేమిటి?
నారదుడు : ఇది కాలప్రవాహం.
దూర్వాసుడు : ఏమిటీ ?!!
నారదుడు : కాల...ప్ర...వాహం.
దూర్వాసుడు : అంటే ?
నారదుడు : కాలం అనేటువంటి ప్రవాహం. ఇందులో భూత భవిష్యత్ వర్తమానా లున్నాయి. [రహస్యంగా] నీవు కోపిష్టివని నీకు భగవంతుడు చిరంజీవత్వం సిద్ధింపజెయ్యలేదుగదా. నీవు ఆ కాలప్రవాహంలో స్నానం చేస్తే నీకు ఎవ్వరి సహాయం లేకుండానే చిరంజీవత్వం సిద్ధిస్తుంది.
దుర్వాసుడు : నిజమా, నారదమహాముని ?
నారదుడు : [నవ్వుతూ] నేను ఎప్పుడైనా అబద్ధం ఆడతాగాని, నవ్వుతూ అబద్ధం ఆడటంచూశావా ?

దూర్వాసుడు : అయితే అదెంతపని ? యిప్పుడే పూర్తి చేస్తాను. నాకోర్కె సిద్ధింపజెయ్యటానికి భగవంతుడే దీన్ని సృష్టించి నాదగ్గరకు పంపా డనుకుంటాను.

నారదుడు : అవునవును. భగవంతుని లీలలు అతి ... ...

దూర్వాసుడు : అయితే నాపని పూర్తిచేసుకుంటాను.

[ వెళ్తుంటాడు. అడుగుల సవ్వడి ]

నారదుడు : (కాసేపటికి) దూర్వాసోమునీ ? దూర్వాసోమునీ?

[ అడుగులసవ్వడి ఆగుతుంది ]

నారదుడు : (బిగ్గరగా) ముందు భూతకాలంలో, తర్వాత వర్తమానంలో, తర్వాత భవిష్యత్ కాలంలో... ఈవరుసలో స్నానంచేస్తేనే చిరంజీవత్వం సిద్ధించేది. వరసక్రమం తప్పకూడదు.

దూర్వాసుడు : (దూరాన్నుంచి) ఓ అదెంతపని... ... నేను దూర్వాసోమునిని (మళ్ళీ అడుగుల సవ్వడి. అడుగుల సవ్వడి క్రక్రమమేణా క్షీణమవు టవుతుంది. దానితో పాటు కాలప్రవాహం రొదకూడా క్రమక్రమమేణా దూరమై క్షీణమవు టవుతుంది. )

నారదుడు : ( నవ్వుతూ ) లౌకికవ్యవహారాల్లో ఈ మునులంత వెర్రిబాగులవాళ్ళు మరొకరు ఉండరుగదా !

* * *

[దూర్వాసోముని అడుగుల సవ్వడి: కిరుకిర్రున నడుస్తుంటాడు. దూరంగా కాలప్రవాహం వినిపిస్తుంది. వెంటనే క్రమ క్రమేణా దూరమవుతుంది, ఈ విధంగా రెండుమూడుసార్లు జరుగుతుంది,

దూర్వాసోముని ఆగకుండా నడుస్తూనే వుంటాడు. చివరకు కాలప్రవాహం, దగ్గరగా కొండలు పిండి అవుతున్నట్లు విని పిస్తుంది. దూర్వాసోముని ఆగుతాడు....]

దూర్వా : భూత వర్తమాన భవిష్యత్ కాలాలలో వరుస క్రమం తప్పకుండా స్నానం చెయ్యాలి... ...నారద మహాని చెప్పినపుడు తేలిక అనుకున్నాగాని, ఈ మహా ప్రవాహంలో భూతకాలం ఎక్కడ? వర్తమానం ఎక్కడ? భవిష్యత్ ఎక్కడ? నా స్నానం ఎక్కడ ప్రారంభం చేసేది?

[కాలప్రవాహం హోరు]

దూర్వాసుడు : కాలప్రవాహాన్ని అడిగి చూస్తాను. కాల ప్రవాహమా! ఓ, కాల ప్రవాహమా!

కాలప్రవాహం : హో (హోరు)

దూర్వాసుడు : (కోపంగా) నేను దూర్వాసోమునిని; ఎవ రను కున్నావో! (కాలప్రవాహం గజగజలాడుతుంది. హోరు తగ్గుతుంది)

కాలప్రవాహం : చిత్తం.

దూర్వాసుడు : నీలో భూత వర్తమాన భవిష్యత్ కాలాలు దాగున్నాయని నారదమహాని చెప్పగా విన్నాను. ఎక్కడెక్కడ వున్నవో చెప్పు. వాటిలో వరుస క్రమం తప్పకుండా నేను స్నానం చెయ్యాలి.

కాలప్రవాహం : చిత్తం మహామహానీ! ఆదిలో భూతకాలం, మధ్యన వర్తమానం, అంతంలో భవిష్యత్తు.

దూర్వాసుడు : సరే, నీవు యిక వెళ్ళు.

[కాలప్రవాహం మళ్ళీ ప్రవహించడం మొదలు
పెడుతుంది. క్రమక్రమేణా వేగం హెచ్చుతుంది.]

దూర్వాసుడు : (సంతోషంగా) ఆదిలో భూతకాలం......
మధ్యన వర్తమానం........అంతలో భవిష్యత్తు.
(నవ్వుకుంటూ) నా పని యింత తేలిగ్గాఅవుతుం దను
కోలేదు. ఎంత తపస్సు ధారపొయ్యవలిసి వస్తుందో
అనుకున్నాను. ముందు మొదలు కనుక్కుంటాను.

[దూర్వాసోముని అడుగుల సవ్వడి, నడిచాడు
నడిచాడు. నడిచినడిచి అడుగులు తడబడుతున్నై.]

దూర్వాసుడు : (కోపం) దీని మొదలెక్కడ ? నడచినకొద్దీ
పెరుగుతూవుందే ! ఓ కాలప్రవాహమా !

కాలప్రవాహం : హో (దూరాన్నుంచి దగ్గరకు వస్తుంది.)

దూర్వాసుడు : నీలో భూతకాలం యెక్కడ ?

కాలప్రవాహం : ఇక్కడే.

దూర్వాసుడు : ఎక్కడ ?

కాలప్రవాహం : ఇక్కడే. ఎక్కడ పడితే అక్కడే.

దూర్వాసుడు : ఎక్కడ ? ఎక్కడ ? ఎక్కడ ?

కాలప్రవాహం : ఇక్కడే ! ఇక్కడే ! ఇక్కడే ! ఎక్కడ
పడితే అక్కడే.

దూర్వాసుడు : (కోపంగా) నన్ను వంచిస్తున్నావ్ ! అగ్నితో
చెరలాట లాడుతున్నావు. నేను మామూలు ముని
ననుకున్నావేమో! సంయమిప్రవరుణ్ణనుకున్నావేమో!!

సత్వగుణ ప్రధానుణ్ణనుకున్నావేమో !!! శకుంతల నడుగు. అంబరీషుణ్ణి అడుగు. నిన్ను శపించి హాత మారుస్తాను. నేనే దూర్వాసో మునినైతే...... నేనే కోపిష్టినైతే... నేనే చిరంజీవత్వం కోసం ప్రయత్నిస్తున్న వాడనైతే, తక్షణం యీ కాలప్రవాహం... ఈ కాలం అనేటువంటి ప్రవాహం...

కాలప్రవాహం : (వొణుకుతూ)మునిసత్తమా, మునిసత్తమా! నన్ను క్షమించు. ఆదరించు. మీ కోపాగ్ని కీలలకు నన్ను ...

దూర్వాసుడు : మరి చెప్పు.

కాలప్రవాహం : చెపుతాను ...ఏం చెప్పను ?

దూర్వా : చెప్పు. ఒక్క క్షణం ఆగటానికి వీల్లేదు.

కాలప్రవాహం : చెపుతున్నాను. మహామునీ! తమ యెడమ చేతివైపు భూతకాలం, ఎదురుగా వర్తమానం, కుడి చేతివైపు భవిష్యత్తు.

దూర్వాసుడు : ఇక వెళ్ళు. జాగ్రత్త. ఇకనైనా మహర్షుల యెదుట యెలా మసులుకోవాలో నేర్చుకో. ఏమనుకున్నావో, మహర్షులు ఆగ్రహిస్తే నిన్ను పుడిసిలితో పట్టి పుక్కిలించగలరు.

కాలప్రవాహం : చిత్తం.

[మళ్ళీ కాలప్రవాహం యథాప్రకారం ప్రవహిస్తూ వుంటుంది. దూర్వాసోముని యెడమచేతివైపు వేగంగా నడుస్తాడు. నడిచాడు, నడిచాడు. విసుగు పుట్టేవరకు నడిచాడు....]

దూర్వాసుడు : ఇదేమిటి? ఎంత నడిచినా మొక్కడికక్కడ యింకా ఎడమచేతివైపు ఉంటూనే వుంది. ఇక కాల ప్రవాహాన్ని అడిగి ప్రయోజనం లేదు. భూత కాలాన్నే. అడిగి చూస్తాను, భూతకాలమా, భూత కాలమా !

భూతకాలం : ఆఁ !

దూర్వాసుడు : ఎక్కడ ?

భూతకాలం : ఇక్కడ.

దూర్వాసుడు : సరి – నా స్నానం యిక్కడ మొదలు పెడతాను.

[నీళ్ళలో అడుగుల సవ్వడి]

వర్తమానకాలం : ఆగు.

దూర్వాసుడు : ఎవరు నువ్వు ?

వర్తమాన : వర్తమానాన్ని.

దూర్వాసుడు : ఎక్కడున్నావు ?

వర్తమాన : భూతకాలంలో.

దూర్వాసుడు : ఆఁ !! భవిష్యత్తెక్కడ ?

వర్తమాన : నాలో.

దూర్వాసుడు : ఏమిటే ? అన్నీ నీలోనేనా ? ఇక వరుస క్రమం తప్పకుండా నేను స్నానం చేసేది ఎలా ? ఇదంతా కాలప్రవాహం చేసిన మోసమే. (కోపంగా) ఓ కాలప్రవాహమా ! నీవు చేసిన మోసానికి...

కాలప్రవాహం : (వొణుకుతూ) స్వామీ క్షమించండి. నేను మోసం చెయ్యలేదు. యదార్థమే చెప్పాను. నేను చెప్పగలిగినదాన్ని కాదుగాని ఎక్కడైనా దోషం వుంటే అది తమరి దృష్టిలో వుంది.

దూర్వాసులు : ఆc! నన్ను నిర్లక్ష్యంచేసింది కాక యింకా అవమానిస్తున్నావా? నీవు భూత, వర్తమాన, భవిష్యత్తులనే మూడు ముక్కలక్రింద తెగిపోదువుకాక!

కాలప్రవాహం : స్వామీ, స్వామీ, స్వామీ... అబ్బబ్బ, తపన తపన. హృదయం ముక్కలవుతూ వుంది. అబ్బా! అమ్మా...

[కాలప్రవాహం తుకతుక ఉడికింది. గుబగుబ పొంగింది. దడదడ లాడింది, మూడు ముక్కలక్రింద విడిపోయింది]

దూర్వాసుడు : అహ్హా హ్హా! నా స్నానానికి యిప్పు డెవ్వరు అడ్డురాగలరు? ఈ టక్కులు సత్వగుణోపేతుల ముందుగాని రజోగుణ ప్రధానుడనైన నాముందా?

సూత్రధారుడు : దూర్వాసోముని భూతకాలంలో స్నానం చెయ్యటానికి సిద్ధపడ్డాడు. కాని ఆశ్చర్యం! ఆయన శాపంవల్ల భూత వర్తమాన భవిష్యత్తులుగా తెగిన మూడు ముక్కలూ యిప్పుడు ప్రవాహాల్లా లేవు. కరుడుకట్టుకు పోయినై. భయంకరమైన చీకట్లను విరజిమ్ముతున్నై. కాలప్రవాహంతో పాటు లోకం చీకటిమయంగా మారింది. ఆ చీకటిలో భూత, వర్తమాన, భవిష్యత్ కాలాలు ఎక్కడున్నవో దూర్వాసోమునికి తెలియలేదు. ఎలా వరుసక్రమంతప్పకుండా

స్నానం చెయ్యటం? ఎలా చిరంజీవత్వాన్ని పొందటం? దూర్వాసోమునికి ఒళ్ళు తెలియని కోపం వచ్చింది. కమండలంతో చీకటిని ఛేదించాడు.

దూర్వాసుడు : భూతకాలమా! నీవు చెట్టుబెరడువు అవుదువుగాక! (గిలగిల తన్నుకొని చప్పున ఆగుతుంది)

దూర్వాసుడు : వర్తమానమా! నీవు చెట్టు బోదెవు అవుదువుగాక!

(గిలగిల కొట్టుకుని చప్పున ఆగుతుంది)

దూర్వా : భవిష్యత్తూ, నీవు చెట్టు విత్తువు అవుదువుగాక!

[గిల గిల తన్నుకొని చప్పున ఆగుతుంది. వెంటనే; కాలప్రవాహం అదృశ్యం అవటంవల్ల ముల్లోకాలు తల్లడిల్లినై, ఇండ్లుకూలిన, చెట్లువిరిగిన, సముద్రాలు పొంగిన, పర్వతాలు కూలిన, ఉరుములు ఉరిమిన ధ్వనులు. మధ్య మధ్య హాహాకారాలు. దేవతలూ, దానవులూ, మానవులూ ఆక్రందిస్తారు. వన్యమృగాల ఘోష. దడదడలాడుతూ, గుండెలు కొట్టుకుంటూ దేవతలూ, దానవులూ మానవులూ, మౌనులు ప్రవేశిస్తారు.]

అందరు : మౌనిచంద్రమా! దూర్వాసోముని! హాత్తోస్మి హాత్తోస్మి. ఎంతపని చేశావు!! కాలప్రవాహాలు ఆగటంవల్ల ముల్లోకాలూ తల్లడిల్లుతున్నై. వర్ణించడానికి వీల్లేని వైపరీత్యాలు జరుగుతున్నై. ఇక ఒక్క క్షణం ప్రపంచం నిలువదు. జీవరాసులు ఊపిరాడక కుప్పతిప్పలుగా పడిపోతున్నై. కరుణించండి. తమరి

శాపం ఉపసంహరించండి. కాలప్రవాహాన్ని యథాథా ప్రకారం కదలి పోనియ్యండి. ప్రపంచాన్ని రక్షించండి.

[ఫెళ ఫెళార్భాటలు; ఆక్రందనాలు]

కొందరు : వింటున్నారా? మాట్లాడరేం? మీకు హృదయం లేదూ?

దూర్వాసుడు : (విచారంగా) అయ్యో! ఎంతపని జరిగింది? వశిష్ట విశ్వామిత్రాది మానులారా, దేవతలారా, దానవులారా, మానవులారా, నేనేం చెయ్యను? నాకు శాపం యిచ్చే శక్తేగాని ఉపసంహరించుకొనే శక్తి లేదే!

కొందరు : మీ కోసం ప్రపంచాన్ని యింత క్షోభ పెడ తారా? ప్రపంచాన్ని నాశనం చేసి మీరేం మూట కట్టుకుందామని?

[నారదమౌని నవ్వు]

విశ్వామిత్రుడు : ఎందు కానవ్వు నారదమానీ?

నారదుడు : నవ్వుకు కారణం వుండాలా విశ్వామిత్ర రాజర్షీ?

విశ్వామిత్రుడు : అదుగో మళ్ళీ రాజర్షి అంటున్నావు!

నారదుడు : (నవ్వి) కాదు కాదు. బ్రహ్మర్షి!

వశిష్టుడు : మీ తగవులాటకు యిదేనా సమయం? దూర్వా సోమునీ! పోనీ శాప విమోచనానికి మార్గం చూపు.

కొందరు : ఆఁ. ఆ పనైనా చెయ్యండి. ఈ తపన మేము భరించలేకుండా వున్నాం.

దూర్వాసోముని : అంతవరకు చెయ్యగలను. ఎవరైతే భూత కాలం అనే బెరడుతో పళ్ళు తోముకుని, వర్తమానం అనే బోదెతో ముఖం కడుక్కొని, భవిష్యత్తు అనే విత్తును భోజనం చేస్తారో—వారివల్ల నా శాప విమోచనం అవుతుంది.

అందరు : అదెంతపని? అదైతే మేము జేస్తాము. క్షణంలో చేస్తాము. ఏదీ భూతకాలం యెక్కడ? యిదుగో పట్టుకోండి.

[భూతకాలాన్ని పట్టుకోబోతారు. అది యెగిరెగిరి అందకుండా కిచకిచమంటూ తప్పించుకుంటుంది.]

విశ్వామిత్రుడు : అరరే! అందినట్టే వుండి అందకుండా పోతుందే!

వశిష్టుడు : మనవల్ల కాదు విశ్వామిత్ర రాజర్షి.

విశ్వామిత్రుడు : అదుగో మీరు కూడా రాజర్షి అంటున్నారు.

వశిష్టుడు : అలవాటు... మనస్సుకి పట్టించుకోకు బ్రహ్మర్షి.

విశ్వామిత్రుడు : అయితే సరే.

వశిష్టుడు : మరిప్పుడేం చేద్దాం.

విశ్వామిత్రుడు : దూర్వాసోమునికి చెపుదాం.

[నారదుడు గుక్కలుపట్టి నవ్వుతాడు]

♦ ♦ ♦ ♦

వశిష్ట–విశ్వామిత్రులు : (బిగ్గరగా) దూర్వాసోమునీ! మావల్ల కాలేదు.

దూర్వాసుడు : మీవల్ల కాదు. కలియుగంలో ఒక మహా పురుషుడు జన్మిస్తాడు. అతడే నా శాపవిమోచనం చెయ్యటానికి సమర్థుడు.

విశ్వామిత్రుడు : కలియుగంలోనా ?

నారదుడు : అవును.

విశ్వామిత్రుడు : వశిష్ట మహర్షి ?

వశిష్టుడు : ఏమి విశ్వామిత్ర బ్రహ్మర్షి ?

విశ్వామిత్రుడు : కలియుగంలో ధర్మం ఎన్ని కాళ్ళమీద నడుస్తుందంటావు?

వశిష్టుడు : ఒంటికాలిమీద.

విశ్వామిత్రుడు : మరి మనవల్ల కానిపని వాళ్లు చేస్తారంటాడు నారద మౌని ?

వశిష్టుడు : నేను నమ్మను.

నారదుడు : (చిరునవ్వు నవ్వుతూ) నమ్మక చేసే దేమిటి? మీవల్ల కాదు; ఒకరు చేస్తారంటే నమ్మరు. ఎన్నేండ్లు వచ్చినా. ఎంత అనుభవం వచ్చినా యీ బుద్ధి మీకు పోదుగదా !

విశ్వామిత్రుడు : నిజమేసుమా !

వశిష్టుడు : నమ్మిచూద్దాం. కాని, కలియుగం వచ్చేవరకూ మనం ఎలా బ్రతకటం ?

విశ్వామిత్రుడు : మనం చిరంజీవులం బ్రహ్మర్షీ.

వశిష్టుడు : అయితేమాత్రం పొగనాా త్రాగొద్దూ.

నారదుడు : (చిరునవ్వు నవ్వుతూ) సత్యం సత్యం. ఏదో ఒకటి చెయ్యాలి. ఏదో ఒకటి తాగాలి.

దేవతలు : కలియుగం వచ్చేవరకూ యీ తపన మేం భరించలేం. అప్పటివరకూ మేము ఆకూ అలంగా ఉంటాం.

దానవులు : మేం కొండా గుట్టలుగా వుంటాం.

మానవులు : మేం కాయ గసరులుగా వుంటాం.

మానులు : మేం దుంపకూరలుగా వుంటాం.

నారదుడు : (నవ్వుతూ) తథాస్తు.

[తంబురగానం; ఆ గానంలోనుంచి యీదురు గాలి, వర్షం; ఉరుములు, మెరుపులు, గాలిహోరు. అంతా నిశ్శబ్దం]

* * *

[వేణుగానం క్రమక్రమేణా దగ్గరకు వొస్తుంది. రెండు దుంపలు అటునుంచీ దొర్లివచ్చి ఒకదాని ప్రక్కన ఒకటి ఆగుతై]

విశ్వామిత్రుడు : వశిష్ట మహర్షి ?

వశిష్టుడు : ఏమి విశ్వామిత్ర బ్రహ్మర్షి ?

విశ్వామిత్రుడు : కలియుగం వచ్చింది.

వశిష్టుడు : ఆం వచ్చిందా ? అందుకే సౌఖ్యంచెం తపన తగ్గింది. మన మామూలు రూపాలు ధరిద్దాం.

విశ్వామిత్రుడు : అలాగే కానిద్దాం వశిష్ట బ్రహ్మర్షీ.

[సంగీతం. రెండు దుంపలు వశిష్ఠ విశ్వామిత్రులుగా మారుతై]

వశిష్టుడు : హా. ఎన్నాళ్ళకు బ్రతికి బైటపడ్డాం. సరేగానీ, విశ్వామిత్ర బ్రహ్మర్షీ. ఆ వ్యక్తి ఏడీ ? కాలప్రవహా

హానికి శాపవిమోచన కలిగించే ఆ మహానుభావుడు యింకా రాలేదే!

విశ్వామిత్రుడు : నాకు నమ్మకంలేదు వశిష్ట బ్రహ్మర్షీ. ఈ నారదమాని మనల్ని మోసంచేసినట్టున్నాడు.

[తంబురగానం, నారదుని ప్రవేశం]

నారదుడు : నేను ఎవర్నీ మోసంచెయ్యను. ఎవరికి వారే మోసంచేసుకుని ఆ సత్యాన్ని ఒప్పుకునే ధైర్యం లేక నామీద పెడుతుంటారు.

విశ్వామిత్రుడు : అయితే ఆ వ్యక్తి ఏడీ?

నారదుడు : అటు చూడండి. (సుడిగాలి)

విశ్వామిత్రుడు : అదుగో వాయుదేవుడు.

వశిష్ఠుడు : కాదు కాదు వరుణదేవుడు (వర్షం)

విశ్వామిత్రుడు : కాదు. కాదు. అరరె......క్షణ క్షణం రూపం మారుస్తున్నాడు. భూదేవిలా గున్నాడు. అగ్నిదేవునిలా గున్నాడు. ఆకాశంలా గున్నాడు.

నారదుడు : ఎందుకంత తొందర పడతావు విశ్వామిత్ర రాజర్షీ?

విశ్వామిత్రుడు : అదుగో మళ్ళీ రాజర్షీ అంటున్నావు!

నారదుడు : కాదు కాదు బ్రహ్మర్షీ! నిదానించి చూడు. యిప్పుడు చూడు.

విశ్వామిత్రుడు : (చూచి) చూశావా వశిష్టబ్రహ్మర్షీ! విచిత్రంగా వున్నాడు. దేవతలకుమల్లే రెక్కలున్నై,

దానవులకుమల్లే కోరలున్నై, మనకుమల్లే గడ్డం వుంది. ఎవరది?

వశిష్ఠుడు : ఎవరో!......అతనేనా ఏమిటి? అదుగో కాలం దగ్గరకు వెళ్ళుతున్నాడు. (దూరాన్నుంచి)

భూతకాలం : అదుగో మహానుభావుడు!

వర్తమానకాలం : అహో!!

భవిష్యత్తుకాలం : వచ్చాడు నా స్వామి!!!

విశ్వామిత్రుడు : చూశావా బ్రహ్మర్షి. అతన్ని కాలాలు ఏవిధంగా చుట్టవేసుకుంటున్నాయో.

వశిష్ఠుడు : అదుగో భూతకాలంతో పంద్లు తోముకుంటు న్నాడు. భూతకాలం వర్తమానకాలంలో కలిసింది.

విశ్వామిత్రుడు : వర్తమానంతో మొహం కడుక్కుంటు న్నాడు. వర్తమానం భవిష్యత్తులో కలిసింది.

వశిష్ఠుడు : చూడు విశ్వామిత్ర బ్రహ్మర్షి. అతను ఎంత తీరిగ్గా కూచోని భవిష్యత్తును భోజనంచేస్తున్నాడో! ఆహా! మళ్ళీ కాలప్రవాహం ప్రవహించటం మొదలుపెట్టింది.

[కాలప్రవాహం ఘోష]

విశ్వామిత్రుడు : ఆహా! ఎన్నాళ్ళకు, ఎన్నాళ్ళకు!! దేవ దానవులారా! మానవ మౌనులారా! మళ్ళీ మీమీ రూపాలను ధరించండి.

[దేవ దానవ మానవ మౌనుల నవ్వులు; అవులింతలు;

కిచకిచలు, మాటలు, ఎవరి రూపాలు వారుధరిస్తారు.
అన్ని గొంతులు కలిసి భగవంతుని ప్రార్థిస్తాయి]

అందరు : మాకు ఎవరివల్ల శాపవిమోచనం కలిగింది ?

విశ్వామిత్రుడు : అదుగో!

అందరు : ఎవరది ?

విశ్వామిత్రుడు : ఏమో !

అందరు : వశిష్ట మహర్షి, ఎవరది ?

వశిష్టుడు : ఏమో నాకూ తెలియదు.

దేవతలు : పశుబలం.

దానవులు : ఇంద్రజాలం.

మానవులు : వర్గకలహం.

మానులు : రంభయో, తిలోత్తమయో, ఊర్వశియో.

నారదుడు : ఎందుకొచ్చిన ఊహాలివి ? అతన్నే అడగ రాదూ ?

విశ్వామిత్రుడు : అడుగుదాం అతన్నే అడుగుదాం. మనకు భయమెందుకు వశిష్ట మహర్షి ?

వశిష్టుడు : పద విశ్వామిత్ర బ్రహ్మర్షి.

అందరు : రండి, రండి, అడుగుదాం రండి. (అడుగుల సవ్వడి)

విశ్వామిత్రుడు : ఏమంటావు వశిష్ట మహర్షి.

వశిష్టుడు : అడుగు విశ్వామిత్ర బ్రహ్మర్షి.

విశ్వామిత్రుడు : నాకేదో యిదిగావుంది వశిష్ట మహర్షి.

నారదుడు : (నవ్వుతూ) భయం. భయం. త్రికాలవేదులైన మానిచంద్రులకు సత్యాన్ని తెలుసుకోటానికి భయం.! (నవ్వు)

విశ్వామిత్రుడు : ఇక ఆపు నారదమానీ. భయమా మాకు? చూడు అడుగుతున్నాను. (గొంతు సవరించుకొని) ఎవరు నువ్వు ?

[అతను ఆవులించాడు]

వశిష్టుడు : ఎవరు నువ్వు ?

[అతను మూడు చిటికెలు వేశాడు]

విశ్వామిత్రుడు : ఇంత నిర్లక్ష్యమా ! ఇలా కాదు. వేదాలను పిలవండి.

వశిష్టుడు : అవి అపౌరుషేయాలు విశ్వామిత్ర బ్రహ్మర్షీ మాట్లాడవు.

విశ్వామిత్రుడు : అయితే ఉపనిషత్తులను పిలవండి.

[ఓంకార ధ్వని]

వశిష్టుడు : వాటంతటవ అవే వొస్తున్నాయి.

[ ఓంకార ధ్వని దగ్గరకు వచ్చి ఆగుతుంది. ]

విశ్వామిత్రుడు : ఉపనిషత్తులారా ! ఎవరది ? (ఓంకారధ్వని) ఉపనిషత్తులు పరీక్షిస్తున్నాయి. ఉపనిషత్తులకు తెలియం దేముంటుంది ?

ఉపనిషత్తులు : ఎవరోహో ! !

విశ్వామిత్రుడు : ఆహాఁ. ఉపనిషత్తులకు కూడా తెలియలేదు.

వశిష్టుడు : (రహస్యంగా) నారదమానిని నడుగు బ్రహ్మర్షీ.

విశ్వామిత్రుడు : నారదమహానీ, ఎవరది ?
నారదుడు : నన్ను మొదలే అడగవలసింది.
విశ్వామిత్రుడు : పోనీ యిప్పు డడిగాంగా చెప్పు.
వశిష్ఠుడు : అడుగు విశ్వామిత్ర...
విశ్వామిత్రుడు : బ్రహ్మర్షి. సరేగానీ అతనెవ్వరో చెప్పు.
నారదుడు : అతనా ?
విశ్వామిత్రుడు : అవును ఎవరు ?
నారదుడు : బుడతకీచు.
వశిష్ఠుడు : బుడతకీచా ?
విశ్వామిత్రుడు : పడతసేచీ !
అందరు : మే మడిగి తెలుసుకుంటాం.
దేవతలు : ఎవరు నువ్వు ?
విశ్వామిత్రుడు : అయ్యయ్యో ! రెక్క లూడిపోతున్నాయి.
దానవులు : ఎవరు నువ్వు ?
వశిష్ఠుడు : అయ్యయ్యో ! కోరలు విరిగినై.
మానవులు : ఎవరు నువ్వు ? ఎవరు నువ్వు ?
మానులు : ఎవరు నువ్వు ? ఎవరు నువ్వు ?
కాలప్రవాహం : నేను నేనే.

[ ఈ మాట కాలప్రవాహం హోరుగా మారుతుంది. కాల ప్రవాహం హోరు పెద్దదవుతుంది. భీకర తరంగాలతో కొండలను లెక్క చెయ్యకుండా ప్రవహిస్తూ వుంది. ]

విశ్వామిత్రుడు : అయ్యయ్యో ! కాలప్రవాహం బుడత కీచుని తన చేతుల్లోకి తీసుకుంటూ వుంది.

వశిష్ఠుడు : తన అంకలో చేర్చుకుంటూ వుండి.

నారదుడు : (నవ్వి) కాలప్రవాహమే అతను. అతనే కాల ప్రవాహం. వీరా దృష్టి దోషంగాని ఎవరి అంకంలోకి ఎవరూ వెళ్ళలేదు.

[కాలప్రవాహం అతిశ్రావ్యంగా ధ్వనిస్తూ ప్రవహిస్తూఉంది. దూరంగా వేణుగానం బైలుదేరి క్రమ క్రమేణా దగ్గరకు వచ్చి, దశదిశలూ కమ్ముతుంది. దేవదానవ మానవ, మౌనులు నిర్ఘాంతపోయి చూస్తూనుంచుంటారు.]



## పాత్రలు :

ప్లీడరు వెంకట్రావు
డాక్టరు కేశవరావు
మూర్తి
సేవకులు
రోగులు
అబద్ధాలకోరు
కవి

నేరం చేసినవాడిని జైలుకు పంపటమూ, జబ్బుచేసినవాడిని ఆస్పత్రికి పంపటమూ, సర్వసాధారణము. కాని ఏదో ఒక మానసికజాడ్యం నేరానికి కారణం కాబట్టీ, కొన్ని ఆరోగ్య నిబంధనల్ని వుల్లంఘించటమే జబ్బుకు కారణంకాబట్టీ, నేరస్థులను ఆస్పత్రికి పంపి, వ్యాధిగ్రస్తులను జైలుకు పంపాలని కొందరు పరిశోధకులు అభిప్రాయ పడుతున్నారు.

ఈ సిద్ధాంతాలను అనుసరించిన వ్యంగ్యరచన

## విచిత్ర ప్రక్రియ

# విచిత్ర ప్రక్రియ

[ప్లీడరు వెంకట్రావుగారి యిల్లు. ఇంట్లోనుంచి ప్లీడరు వెంకట్రావుగారూ, డాక్టరు కేశవరావుగారూ వసారాలోకి వస్తారు. వసారాలో వెంకట్రావుగారి బావమరది, మూర్తి పడక కుర్చీలో కూర్చుని తదేక ధ్యానంతో చదువుతూ వుంటాడు.]

వెంకట్రావు: ఇంతకీ అసలు అమ్మాయికి జబ్బేమి టంటారు, డాక్టరుగారూ ?

డాక్టరు : జబ్బేమీ వున్నట్లు కనపడదు.

వెంకట్రావు : మరి ఎందుకండీ రోజురోజుకీ అట్లా శుష్కించి పోతోంది ?

డాక్టరు : కారణం ఏదో వుంటుంది. నాకుమాత్రం గోచరించటంలేదు.

వెంకట్రావు : పెద్ద డాక్టర్లు మీరే అట్లా అంటే.........

డాక్టరు : పెద్ద అయినా చిన్న అయినా శాస్త్రం ఒకటే గదండీ. శాస్త్రానికి అతీతమైనవి కొన్ని వుంటాయి.

వెంకట్రావు : అయితే, మా అమ్మాయి సంగతి ఏం చెపుతారు ?

డాక్టరు : స్థలం మార్పు చేయించండి.

వెంకట్రావు : ఏమో, డాక్టరుగారూ! మందువల్ల కుదరరంది, స్థలం మార్పువల్ల కుదురుతుందా? మన భ్రమ గాసీ.

డాక్టరు : అట్లా అనకండి. ఎక్కువగా జబ్బులన్ని ప్రకృతే నయం చేస్తుంది. మేం చేసేదల్లా ప్రకృతి ప్రయత్నా నికి దోహదం యివ్వటం మాత్రమే. శరీరంలోవున్న లోపంవల్లే కాక పరిసర ప్రాంతాల యిన్‌ఫ్లుయన్సవల్ల కూడా జబ్బు లొస్తూంటాయి. అటువంటి జబ్బులకు స్థలం మార్చటమే మంచి మందు. నా మాట విని అమ్మాయిని ఎక్కడికైనా తీసుకువెళ్ళి విశ్రాంతి తీసుకోనివ్వండి.

వెంకట్రావు : తప్పకుండా తీసుకువెళ్తాను. మీరు మాట్లా డుతూవుంటే వైద్యంకూడా మామూలు విషయం లాగు కనిపిస్తుందండీ. వింటూ వింటూ వుండగానే నమ్మకం ధ్వతుంది.

డాక్టరు : ఊఁ... ఊఁ... ఊఁ... (సిగ్గుపడతాడు)

వెంకయ్య : (ప్రవేశించి) ప్లీడరుగారూ!

వెంకట్రావు : ఏం వెంకయ్యా అట్లావున్నావేం?

వెంకయ్య : ఏం చెప్పను ప్లీడరుగారూ? సుబ్బయ్య మళ్ళీ నామీద క్రిమినల్ కేసు పెట్టాడు. ఇవ్వాళే నోటీసు లందినయ్.

వెంకట్రావు : అతన్ని ఏదో చేసుంటావు. లేకపోతే ఊరికనే ఎందుకు కేసు పెడతాడు?

వెంకయ్య : నే నేం చెయ్యలేదండీ ప్లీడరుగారూ. అతనే పది మందిలో పట్టుకుని నన్ను నోటికివచ్చినట్లు కూశాడు. నే నొకటి వేసేతలికి తలపగిలింది.

వెంకట్రావు : ఛీ; ఎన్నిసార్లు చెప్పినా నీకు బుద్ధిరాదుగదా! జైలునుండివచ్చి సరిగా పదిరోజులైనా కాలేదు.

వెంకయ్య : అయితే మీ రనేదేమిటి ప్లీడరుగారూ? వాడు కూసే కూతలన్నీ పడి వూరుకోమంటారా? వెళ్ళితే మళ్ళీ జైలుకన్నా వెళ్లతాగాని వాడితో మాట పడను.

వెంకట్రావు : ఊఁ పౌరుషాని కేమిలేవోయ్! కూటి కొచ్చేదా; గుడ్డకొచ్చేదా? వెళ్ళి గుమాస్తా దగ్గర కూరో్చు, వస్తా.

వెంకయ్య : చిత్తం (నిష్క్రమణ)

వెంకట్రావు : ఈ గాంధీగారు వచ్చారు. జైలంటే ఎవ్వరికీ లెక్కలేకుండా పోయిందండీ.

డాక్టర్ : అచ్చగా గాంధీగారే కారణం అనుకోకండి. భయ పెట్టి మానవుని మనసు లోబరచుకోవా లనుకోవ టంలో వచ్చింది చిక్కు. భయం అలవాటయి పోతుంది చూడండీ. అలవాటు అయిపోగానే మనిషి మామూలు అయిపోతాడు.

[మధ్యమధ్య వింటూ, చదువుకుంటూ, చివ్వరికి తదేక ధ్యాసంగా వింటున్న మూర్తి చటుక్కున అందుకుంటాడు]

మూర్తి : నిజం—ముమ్మాటికీ నిజం.

వెంకట్రావు : ఏమిటది, మూర్తీ ?

మూర్తి : డాక్టరుగారు చెప్పింది నిజం. ఈ గ్రంథకర్తకూడా అమాటే చెప్పాడు. విను బావా చదువుతాను. (చదువుతాడు)

"నేరాలు చెయ్యటం మానవ మనస్తత్వానికి సంబంధించిన జబ్బు. మనస్తత్వం గతానుగతికంగా వచ్చే ఆహార వ్యవహారాలమీదా, మానవుడు పుట్టి పెరిగిన పరిస్థితులమీదా, ప్రచారంలోవున్న సంస్కారాల మీదా, శరీర తత్వంమీదా ఆధారపడి వుంటుంది. మానవుడు నేరం చెయ్యకుండా వుండాలంటే అతని మనస్తత్వం మారాలి"

వెంకట్రావు : చాల్లేవోయ్. వెధవ కబుర్లు.

మూర్తి : అట్లా తోసెయ్యకు బావా! ఈ గ్రంథకర్త చాలా గొప్పవాడు. అలా తేలిగ్గా కొట్టివెయ్యకు మరి...

వెంకట్రావు : కాకపోతే ఏమిటి నువ్వు చెప్పేది? అన్నం కోసం దొంగతనం చేసేవాడు, అన్నంలేక చేస్తాడు. అతన్ని పిలిచి భోజనంపెట్టి పంపించమనేగా నీ వుద్దేశం ?

మూర్తి : అట్లాకాదు బావా. అన్నం లేనంత మాత్రాన అందరూ దొంగతనాలు చేస్తున్నారా ? కొద్దిమందే చేస్తున్నారు. కాబట్టి దొంగతనం చెయ్యటానికి అన్నం లేకపోవటమే కాక మరో కారణం కూడా వుండివుండాలి ? ఆ కారణం తెలుసుకుని దాన్ని నిర్మూలిస్తే మానవుడు దొంగతనాలు చెయ్యడు.

వెంకట్రావు : మాట్లాడితే కారణం, కారణం అంటావు. అన్నిటికీ కారణం వుండాలా? ఉంటేమట్టుకు మనకు తెలియాలా? అయినా ఆ కారణం యేమిటో చెప్పు?

మూర్తి : అన్నం అందరికీ అవసరమే. కాని నీతికి కట్టుబడిన మానవుడు దొంగతనం చెయ్యడు. పదిమందిని కూడ గట్టుకుని సంఘంలో యిప్పుడున్న పద్ధతిని మార్చి అందరికీ అన్నం దొరికేటట్టు చేస్తాడు. దానివల్ల సంఘం బాగుపడుతుంది. తన అవసరం తీరుతుంది.

వెంకట్రావు : ఒట్టి మిడి మిడి జ్ఞానం.

డాక్టరు : మూర్తి చెప్పినదానిలో సత్యం లేకపోలేదండి. సైకోయనలిష్టులు యీ విధంగా ప్రయత్నించి అనేక మనస్తత్వాలు మార్చారు. జబ్బులు కుదిర్చారు.

వెంకట్రావు : మీరు కూడా అట్లాగే అంటున్నారా?

డాక్టరు : నే నొకటి అడుగుతాను చెప్పండి. ఇందాక వొచ్చాడే వెంకయ్య, అత నొకసారి జైలుకు వెళ్ళి కూడా మళ్ళీ వెళ్ళటానికి యెందుకు సంకోచించటం లేదు చెప్పండి!

వెంకట్రావు : త న్నెగతాళి చేశాడని సుబ్బయ్యమీద కోపంవల్ల.

డాక్టరు : జైలుకు వెళ్ళవలసి వస్తుందనే భయంకంటే సుబ్బయ్యమీద కోపం తీవ్రరూపం ధరించిందన్న మాట.

వెంకట్రావు : అవును.

డాక్టరు : వెంకయ్య అంత కోపదారి కాకపోతే ఏమయ్యేది?

వెంకట్రావు : తుపుచుకు వెళ్ళేవాడు. వాడి పాపాన వాడు పోతాడులే అని సర్దుకునేవాడు.

డాక్టరు : అదీ! ఇంకొక సంగతి అడుగుతాను చెప్పండి. అతనికి మాత్రం అన్ని విషయాల్లో కోపం వస్తుందా?

వెంకట్రావు : రాదు. కొన్ని విషయాల్లో చాలా సాత్వికంగా వుంటాడు.

డాక్టరు : మరి యీ విషయంలో యెందుకు పిలిస్తే పలుకుతుంది కోపం?

వెంకట్రావు : అతడు అవమానం సహించడు.

డాక్టరు : అదీ! నోరు జారటం తప్పుగాని, మాట పడటం తప్పుగాదనీ; యెదటివాడి తప్పు క్షమించటం గొప్ప గుణమనీ; పౌరుష మనుకుని యెదటివాణ్ని శిక్షించటం కంటే; జాలి తలిచి మన్నించటమే వుత్తమమనీ; అవమాన పడవలసింది దూషించినవాడు గాని తను గాదనీ వెంకయ్యకు బోధించా మనుకోండి. అతనీ నేరం చేసేవాడా?

వెంకట్రావు : చేసేవాడు కాడు.

డాక్టరు : ఎందుకని?

వెంకట్రావు : కోపం తెచ్చుకోవటం తప్పని తెలుసుకున్నప్పుడు జైలు కళ్ళముందు కనపడేది.

డాక్టరు : అదే మన మూర్తి చెప్పేదీనీ. ఈ విధంగా మన స్తత్వం మార్చి నేరాలు జరుగకుండా చెయ్యవచ్చంటాడు.

[ వెంకట్రావు ఆలోచనలో పడతాడు ]

మూర్తి : అవును బావా. ఈ కొత్త వైద్యం డాక్టరుగారూ, నీవూ ఆచరణలో పెట్టాలి. ఒకరి దగ్గరికి రోగులూ, ఒకరి దగ్గరకు నేరస్థులూ వస్తూంటారా? మీరే దీనికి తగినవారు.

డాక్టరు : అయితే మూర్తీ! ఆ గ్రంథకర్త మందులు అవసరం లేదని చెప్పాడా?

మూర్తి : లేదండీ. శారీరక స్థితివల్ల వచ్చే జబ్బులకు మందులు బాగా వుపకరిస్తాయన్నాడు.

వెంకట్రావు : అయితే శిక్షలు మాట యేమన్నాడు? పూర్తిగా రద్దు చేయమన్నాడా?

మూర్తి : మన స్తత్వంగా యేర్పడని నేరా లుంటాయి చూడండీ. వాటికి శిక్షలు అవసరం అన్నాడు. అశ్రద్ధ వల్ల వచ్చే జబ్బులకు శిక్షించీ, భయపెట్టీ; శారీరక స్థితివల్లా, మన స్తత్వంవల్లా చేసే నేరాలకు మందులు వాడీ, తత్వాన్ని మార్చి—యిట్లా చేస్తే సంఘం బాగుపడుతుందని చెప్పాడు.

డాక్టరు : బాగుంది. చాలా ఆలోచనమీదే వ్రాసి నట్లున్నాడు.

మూర్తి : బాగుందని అంతటితో వూరుకుంటే కాదు. మీరు ఆచరణలో పెట్టాలి.

వెంకట్రావు : పుస్తకం యిట్లా యివ్వు మూర్తీ. మాపటికి ఒకసారి చదువుతాను. (మూర్తి పుస్తకం అందిస్తాడు.

వెంకట్రావు అటూ యిటూ తిరగేసి) చదవటాని
కైతే చదువుతాగాని ఆచరణా, గీచరణా మనం
పెట్టుకోవద్దండీ డాక్టరుగారూ!

డాక్టరు : ముందు పుస్తకం పూర్తి కానివ్వండి.

౨

[ ఆ రాత్రి డాక్టరు గది. డాక్టరు నిద్రపోతూ వుంటాడు. కల.
కలలో ఆస్పత్రి. డాక్టరు మందులిచ్చే పనిలో వుంటాడు. ]

నౌకరు : (ప్రవేశించి) రోగులు తమ దర్శనం కోసం కూర్చు
న్నారండి!

డాక్టరు : ఒకరి తర్వాత ఒకర్ని రమ్మను.

నౌకరు : చిత్తం.

డాక్టరు : అందర్నీ ఒకసారి ప్రవేశపెట్టేవ్. పిచ్చి ఆసు
పత్రిగా తయారవుతుంది.

నౌకరు : చిత్తం. ఒక్కొక్కర్నే ప్రవేశ పెడతానండీ.
(నిష్క్రమణ)

డాక్టరు : పోలీస్!

పోలీస్ : (ప్రవేశించి) యస్. సర్. (కాలుకొట్టి సలాం
చేస్తాడు)

డాక్టరు : రోగు లొస్తున్నారు. నా ప్రక్కన నుంచుని
ధైర్యంగా వుండి నే చెప్పిన వాళ్ళను చెప్పినట్లు
అరెస్టు చేస్తూవుండు.

పోలీస్ : నేరాలు చేసినవారినితప్ప రోగాలు తెచ్చుకున్న వారిని అరెస్టుచేసే అధికారం నాకు లేదుసార్.

డాక్టరు : రోగం తెచ్చుకుని ప్రాణం మీదకు తెచ్చుకోవటం కంటే గొప్ప నేరం యేముంటుందోయ్ యీ ప్రపంచంలో! ఆశకొద్దీ ఒకడు యెక్కువ తింటాడు; జబ్బు చేస్తుంది. అది చేతులారా చేసుకున్న నేరమంటావా, కాదా? అటువంటి వాళ్ళను శిక్షించా లంటావా, లేదా?

పోలీస్ : నాకు తెలియటంలేదు సార్.

డాక్టరు : పోలీసులకు తెలియటం అనవసరం. ఇతరులు చెప్పినట్లు చెయ్యటమే మీ వుద్యోగం.

పోలీస్ : యస్. సర్. (కాలుకొట్టి సలాం చేస్తాడు)

[ఇద్దరు తల్లిదండ్రులు పసిబిడ్డలను చేతుల్లో పెట్టుకుని వస్తారు..........]

తండ్రి : రక్షించండి డాక్టరుగారూ! రక్షించండి.

తల్లి : ఒక్కగాను ఒక్కపిల్ల—లేక లేక పుట్టింది. ఈ పసిగుడ్డుమీంద కండ్లు పెట్టుకుని బ్రతుకుతున్నాం. రాత్రి వరకు బాగానేవుంది డాక్టరుగారూ. ఉన్నట్టుండి ముంచుకొచ్చింది. (ఎక్కెక్కి యేడుస్తుంది)

డాక్టరు : గోల చెయ్యకుండా రోగలక్షణాలేమిటో చెప్పండి.

తల్లి : అయ్యో, డాక్టరుగారూ, మమ్మల్ని అడిగితే మాకేం తెలుస్తుంది? ఒకటే తుమ్ములూ, ఒకటే దగ్గులూ, రాత్రంతా నోటిమీంద మూత వుంటే వొట్టు డాక్టరు

గారూ. రోగలక్షణాలు చెప్తుయుంటే మేమేం చెప్పం డాక్టరుగారూ!

డాక్టరు : నిన్న యేం తినిపించావు, పసిపిల్లకి?

తల్లి : ఏం తినిపించలా డాక్టరుగారూ. ఒట్టు. నాపాలే. పాలిచ్చి పడుకోబెడితే, నే పనిపాటలన్నీ చేసుకొనే దాకా మెదలకుండా పడుకునేది వరాలతల్లి. నా వరాలతల్లి కొచ్చిందె [ఏడుస్తుంది]

డాక్టరు : నిజం చెప్పు. లేకపోతే జైల్లో వేయిస్తాను. పోలీస్!

పోలీస్ : యస్. సర్.

డాక్టరు : సిద్ధంగా వుండు.

పోలీస్ : రెడీ సర్ [కాలు కొట్టి సలాం చేస్తాడు.]

తల్లి : (భయంగా) అయ్యయ్యయ్యో వద్దు. వద్దు. నిజం చెప్తాను.

డాక్టరు : నిజం చెప్పు. నిన్న పిల్ల కేం తినిపించావ్?

తల్లి : ఏమీ తినిపించలా డాక్టరుగారూ? పుట్టినప్పటి నుంచీ నా పాలే. నా పాలుతాగి ఏడవకుండా కన్ను తెరవకుండా పడుకుంటూవుంటే పాలుచాలక నిస్సత్తు వయ్యిందనుకొని పూటకు నాలుగు మెతుకులు తినిపిస్తున్నా. అంతే డాక్టరుగారూ, నేను ఏపాపం ఎరుగను. (ఏడుస్తుంది)

కండ్రి : అది చెప్పింది యదార్థం డాక్టరుగారూ. నిన్న సాయంకాలం నాలుగు మెతుకులు తినిపించి ఆ చల్ల గాలికి నాపక్కలో పడుకోబెట్టింది. అర్ధరాత్రయ్యే

టప్పటికి లేచిచూద్దును గదా ఒకేటే తుమ్ములూ, ఒకటే దగ్గులూ.

డాక్టరు : ఇకచాలు. ఆపు. పోలీస్ !

పోలీస్ : యస్. సర్.

డాక్టరు : సిద్ధంగా వున్నావా ?

పోలీస్ : రెడీ సార్. [కాలుకొట్టి సలాం]

డాక్టరు : తనపాలే అక్కర్లేక మగతగావున్న పిల్లకు అన్నం పెట్టి రోగం తెచ్చినందుకు యీమెకు రెండు సంవత్సరాలు కఠినశిక్షా, చలిగాల్లో పడుకోబెట్టుకొని రోగాన్ని పెంచినందుకు ఇతనికి ఒక సంవత్సరం విడిశిక్షా విధిస్తున్నాను.

తండ్రి : [సంభ్రమాశ్చర్యాలతో] డాక్టరుగారూ. డాక్టరు గారూ.

తల్లి : ఇదేం వైద్యం ఓరి భగవంతుడా !

డాక్టరు : తీసుకు వెళ్ళు పోలీస్.

పోలీస్ : యస్ సర్. రండి చూస్తారేం ? రండి. [పోలీసు లాక్కువెళుతుంటే వాళ్ళు ఏడుస్తూ శాపనార్థాలు పెడుతూ నిష్క్రమిస్తారు. బిడ్డ డాక్టరు చేతుల్లోనే ఉంటుంది ]

డాక్టరు : నర్స్ !

నర్స్ : [ప్రవేశించి] సర్.

డాక్టరు : ఈ బిడ్డకి మందూయిచ్చి నువ్వు పెంచి పెద్దవాణ్ణి చెయ్. పెంపకం సరిగ్గా లేక పాడైపోయింది. నీ చేతుల్లో

నవనవలాడుతూ పెరుగుతుంది. (నర్సు బిడ్డను తీసుకు వెళ్తుంది)

రోగి : (ప్రవేశించి) డాక్టరుగారూ!

డాక్టరు : త్వరగా కానియ్. ఏమిటి నీ జబ్బు?

రోగి : జ్వరమండీ. ఉన్నట్టుండి అకస్మాత్తుగా వస్తుంది. అది కూడా ప్రతిరోజూ రాదండీ. రోజు విడిచి రోజు వస్తుంది

డాక్టరు : చలేస్తుందా?

రోగి : చలితోనేనండీ ప్రారంభం. శాలువా మీద శాలువా పది శాలువాలు కప్పినా ఆగదండీ. అదుగో వస్తూం దండీ. ఉఁహుఁ ఉహుహుఁ... వచ్చిందండీ. ఉహుఁ హుహుఁ... ఇష్. ఇష్ ఉహుఁహుఁ... ఇక ఇప్పట్లో వొదలదండీ డాక్టరుగారూ. (ఉహుఁ హుహుహు అని అంటూనే ఉంటాడు.)

డాక్టరు : మలేరియా అన్నమాట.

రోగి : (వణుకుతూ) అవునండీ. ఉహుఁహుఁ... ఉహు... హుఁ... అవునండీ. డాక్టరుగారూ. మలేరియానేనండీ ...పోయిన డాక్టరుగారు కూడా యీ మాటే చెప్పా రండి. శాలువా ఒకటుంటే యిప్పించండి డాక్టరు గారూ.

డాక్టరు : పోలీస్!

పోలీస్ : రెడీసార్ (కాలుకొట్టి సలాం)

డాక్టరు : నీ కోటు యితనికి తొడుగు.

పోలీస్ : నో సార్ (కాలు కొట్టబోతుండగా)

డాక్టరు (కోపంగా) తొందరగా !

పోలీస్ : యస్, సర్ (కాలుకొట్టి సలాంచేసి కోటు తొడుగుతూ వుంటాడు)

రోగి : ఆఁ ఆఁ. ఇప్పుడు కొంచెం ఆగిందండీ డాక్టరుగారూ. తమ కోటుకూడా ఒకసారి దయచేయించారా...

డాక్టరు : (కోపంగా) ఏమిటీ ?

రోగి : ఊహుఁహుఁ... తమరి కోటు.

డాక్టరు : నోరు మూసి నేను అడిగిందానికి జవాబుచెప్పు...

రోగి : చిత్తం. చిత్తం.

డాక్టరు : ఎన్నాళ్ళనుంచి వస్తుంది యీ జ్వరం ?

రోగి : (ఒణుకుతూ) ఎన్నాళ్ళనుంచి రాకేం డాక్టరుగారూ. ఊహుఁహుఁ... అయిదేళ్ళయిందండీ. వస్తుంటుందీ, పోతుంటుందీ... మళ్ళీ వస్తుంటుందీ... ఊహుఁహు...

డాక్టరు : మంచానికి దోమతెర కట్టుకుని పడుకున్నావా ?

రోగి : లేదండీ.

డాక్టరు : డాక్టర్లు చెప్పలా ?

రోగి . చెప్పారండీ.

డాక్టరు : మరెందుకు చెయ్యటంలా ?

రోగి : దోమతెర కట్టుకుంటే నాకు నిద్ర పట్టదండీ... ఉష్ ...గాల్లేక ప్రాణం... హుహుఁ... రావలసి వుంటే కట్టుకుంటే మాత్రం... హుహు...

డాక్టరు : పోలీస్.

పోలీస్ : యస్ సర్ (కాలుకొట్టి సలాం)

డాక్టరు : దోమతెర కట్టుకోమని డాక్టర్లు చెప్పినా వినకుండా మలేరియా తెచ్చుకుంటున్నందుకు ఇతనికి మూడేండ్లు కఠినశిక్ష విధించాను.

రోగి : చెవులు దిబ్బడేసి సరిగా వినపట్టంలేదు, డాక్టరుగారూ ఏమిటీ అంటున్నారూ ?

పోలీస్ : మూడేళ్ళోయ్ !

రోగి : క్వైనైనా అండీ. క్వైనైన్ నాకు వద్దు డాక్టరుగారూ. తినితిని విసుగెత్తిందండీ... పైత్యం తలకెక్కిందండీ. రక్తమంతా విరిగి పోయిందండీ, డాక్టరుగారూ. హుహుః. ఉహుః. హుః...యింకేదన్నా మందివ్వించండీ.

డాక్టరు : పోలీస్ !

పోలీస్ : యస్, సర్ (రోగితో) రా. అయ్యా రా.

రోగి : వద్దురా బాబూ యీ క్వైనైను. ఉహుహుః...... వద్దురా... ఉహుహుః (ఇద్దరూ నిష్క్రమిస్తారు)

* * *

[కాసేపు దాటింతర్వాత డాక్టరు యదాలాపంగా కూర్చుని వుంటాడు. పోలీసు ప్రక్కన నుంచుని వుంటాడు దిగులుగా]

డాక్టరు : ఏం పోలీస్ అట్లా వున్నావేం ?

పోలీస్ : రోగులందర్నీ ఒకేసారి లారీమీద తీసుకువెళ్దామని ఆఫీసు గదిలో పెట్టి తాళం వేయించా. సార్.

వాళ్ళను చూస్తుంటే కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నయ్ సార్.

డాక్టరు : కళ్ళల్లో నీళ్ళున్న వాడివి నువ్వెందుకు పనికివస్తా వోయ్ పోలీసు ఉద్యోగానికి ?

పోలీస్ : కాదుసార్. ఇంకెప్పుడూ యిటువంటి పనులు చెయ్యం, మమ్మల్ని విడిపించండని కాళ్ళా వేళ్ళా బడి బ్రతిమాలుతున్నారు సార్.

డాక్టరు : శిక్ష అనుభవించకముందే యెంత మారిపోయారో చూశావా పోలీస్ !

పోలీస్ : చూశానుగానీ సార్ ...

డాక్టరు : ఏమిటో చెప్పు ... అనుమానిస్తావేం ?

పోలీస్ : తమరికీ ...

డాక్టరు : ఊఁ ... నాకు ... ?

పోలీస్ : పిచ్చెత్తిం దనుకుంటున్నారు సార్.

డాక్టరు : ఆఁ ... నిజమే !

పోలీస్ : యస్. సర్. [కాలుకొట్టి సలాం చేస్తాడు]

ఒకయువతి : [తండ్రితో ప్రవేశించి] మిమ్మల్నందర్నీ చంపు తాను. రక్కుతాను ... కొరుకుతాను ... నా గోళ్ళతో చీరతాను ... ... ఊఁ ... ఊఁ ... ఊఁ ...

పోలీస్ : దెయ్యం. డాక్టరుసాబ్ – దెయ్యం సార్. [పారిపో తుంటాడు]

డాక్టరు : ఎక్కడికి పోలీసూ, పారిపోతున్నావ్ ?

పోలీస్ : [భయంగా] నాకు దెయ్యాలమీద జూరిస్ డిక్షన్ లేదుసార్.

డాక్టరు : [గర్జిస్తూ] యిట్లాగా !......

పోలీస్ : యస్. సర్. [కాలుకొట్టి సలాం]

యువతి : నే నెవర్ననుకుంటున్నారో......అంబని ... జగదాంబని...మిమ్మల్నందర్నీ పీలుస్తా...పిప్పిచేస్తా... [ఊఁ ఊఁ అని పూనకం పూనినట్లు అంటూనే వుంటుంది]

తండ్రి : వూరుకో అమ్మా !

డాక్టరు : ఎవరయ్యా మీరు ?

తండ్రి : ఈ అమ్మాయి మా అమ్మాయేనండీ. రెండు సంవత్సరాలనుంచి హిస్టీరియాతో బాధ పడుతూవుంది.

డాక్టరు : పెళ్లయిందా ?

తండ్రి : అయ్యిందండీ. [విచారంగా] భర్త పోయాడు ... ఏం చెప్పుకోను డాక్టరుగారూ...[విచారంగా] భర్త పోయాడు.

డాక్టరు : మళ్ళీ పెళ్ళి చెయ్యలేకపోయావా ?

తండ్రి : పెళ్లే! మేం ఏం, అలగావాళ్ళ మనుకున్నారా, డాక్టరుగారూ. మీదగ్గర కొచ్చామని ... మాటలు కొంచెం జాగ్రత్తగా రానివ్వండి.

డాక్టరు : పోలీస్ !

పోలీస్ : రెడీ సర్ [కాలుకొట్టి సలాం]

డాక్టరు : ప్రకృతివాంఛ తీర్చుకోకుండా ఉండటంవల్ల శరీరంలో జబ్బులు ప్రవేశిస్తాయని తెలుసుకోక, సంఘానికి భయపడి, మూఢాచారాలకు బానిసయి, తన కూతురి జీవితాన్ని నాశనంచేసిన యీ తండ్రికి యావజ్జీవ ద్వీపాంతర వాసశిక్ష విధిస్తున్నాను.

తండ్రి : అదేమిటి డాక్టరుగారూ ? ... ...

యువతి : చూడు నిన్నేంచేస్తానో ! చంపుతా ... రక్కుతా ... ఊఁ ... నేను అంబని ... జగదాంబని ...

డాక్టరు : పోలీస్ !

పోలీస్ : యస్. సర్. [కాలుకొట్టి సలాం] ... రండి ... ఆఁ ... [పోలీసు తండ్రినీ, కూతుర్ని రెక్కపట్టుకుని తీసుకపోతాడు]

3

[ఆదేసమయం. ప్లీడరు వెంకట్రావుగారి యిల్లు. వెంకట్రావు పడుకొని నిద్రపోతూ వుంటాడు .... కల ....కలలోకోర్టు....కొంత మంది నేరస్థులుంటారు. వెంకట్రావుగారి ప్రక్కన సేవకుడు. వెంకట్రావు గారు తీర్పులు చెప్పే పనిలో వుంటాడు.....]

వెంకట్రావు : వీరంతా నేరస్తులేనా ?

సేవకుడు : చిత్తం.

వెంకట్రావు : ఇతనెవరు ?

సేవకుడు : అబద్ధాల కోరండీ. అబద్ధాలాడి కొంపలార్పుతుంటాడు.

అతను : వొట్టిదండీ. అన్నీ అబద్ధాలండీ. నేను పుట్టిం తర్వాత యింతవరకు అబద్ధం అంటే ఎటువంటిదో ఎరగనండీ.

వెంకట్రావు : ఎప్పుడూ అబద్ధమాడి ఎరగవ్ ?

అతను : ఎరగనండీ

వెంకట్రావు : కలలో గూడా ?

అతను : కల్లో, ఇల్లో, ఒళ్ళో ఎప్పుడూ ఆడి ఎరగనండీ. ఏ ఒట్టు పెడితే ఆఒట్టండీ సర్వీస్ కమీషన్ ముందు కూడా అబద్ధం ఆడి ఎరగనండీ.

వెంకట్రావు : అయితే నిజమాడు తున్నావన్నమాట !

అతను : నిజమా అండీ ?...

వెంకట్రావు : అవును. (గట్టిగా) అబద్ధమాడకపోతే నిజమాడుతున్నట్టేగా ?

అతను : [భయపడి] అబ్బెబ్బె ! నిజంకూడా ఎప్పుడూ ఆడ నండీ.

వెంకట్రావు : మరేవిటోయ్ ను వ్వాడేది ?

అతను : మాటలండీ, వొట్టి మాటలండీ... గ్యాస్ అంటారే గ్యాస్. అదండీ నేను ఆడేదీ...గ్యాసండీ... వొట్టి గ్యాస్.

వెంకట్రావు : ధ్వనిని సృష్టించటంతప్ప అబద్ధం-నిజం అనే జ్ఞానంకూడా నీకు నశించినట్లుంది.

అతను : బహుబాగా శెలవిచ్చారండీ. తెలివికలవారు గనుక యింతలో కనిపెట్టేశారు. నిజం, అబద్ధం అనే జ్ఞానం నశించిన నేను అబద్ధం ఆడడ మేమిటండీ?

వెంకట్రావు : చాల్లే యిక ఆపు. ఇటీవల యితను ఆడిన అబద్ధ మేమిటోయ్ ?

సేవకుడు : వెంకుపంతులికి అతనిభార్యమీద అబద్ధాలుచెప్పి కాపరం కూలదోశాడండీ.

అతను : వట్టిదండీ అంతా అబద్ధం. శుద్ధ అబద్ధం. వెంకు పంతుల్ని నేను ఎరగనే ఎరగనండీ.

వెంకట్రావు : ఎరుగవ్ ?

అతను : (ఎరక్కపోవటం తప్పేమో అనుకుని) ఒకసారి బజారున వెళ్ళుతుంటే చూశాలెండి.

వెంకట్రావు : (కోపంగా) మరి యెరగ నంటావేం ?

అతను : నేను యెరగంది అతని భార్యనండీ.

వెంకట్రావు : ఆయన భార్యను నువ్వెరగవ్ ?

అతను : ఎరగనండీ. నా ప్రాణం పోయినా అబద్ధం ఆడ నండీ. ఒకరోజు నేను వారింటికి వెళ్ళితే వారే తన భార్యను గురించి నాకు చెప్పారండీ.

వెంకట్రావు : అయితే, వెంకుపంతులు యిల్లు నీ వెరుగుదు వన్నమాట !

అతను : (తప్పనుకుని) ఎరగనండీ.

వెంకట్రావు : ఎరక్కుండా అతని యింట్లోకి యెట్లా వెళ్లావ్?

అతను : సందు గుమ్మంలోనుంచండీ. (అంతా నవ్వుతారు) అబ్బెబ్బే ! నే వెళ్ళలేదండీ.

వెంకట్రావు : ఎందుకోయ్ అట్లా అబద్ధా లాడతావ్ ?

అతను : అబద్ధాలా అండి ? నా ప్రాణం పోయినా ఆడనండి.

వెంకట్రావు : మరి వెళ్ళి-వెళ్ళలేదంటావేం ?

అతను : వెళ్ళి-వెళ్ళలేదంటే అబద్ధమా అండీ ? బాగానే ఉందండీ మీరు చెప్పేది. ఇదే అబద్ధమైతే, రాజకీయవేత్తలు, వేదాంతులూ, ప్రభుత్వోద్యోగులు ఆడేవాటిని ఏమంటా రండీ ? !!

వెంకట్రావు : ఊc. ఇతను అబద్ధం అంటే యేమిటో కూడా తెలుసుకోలేని స్థితిలో వున్నాడు. దీనికి యేదో ఒక జబ్బు కారణం అయి వుండాలి. ఆc... దీనికి అజీర్తి కారణం. ఇతన్ని తీసుకువెళ్ళి ఒక సీసా చిట్టాముదం పొయ్యండి.

అతను : చిట్టాముదమా అండీ... నాకా అండీ (హఠాత్తుగా) వొద్దండీ... (హఠాత్తుగా) అమ్మో...

వెంకట్రావు : ఇంకొక సీసా చిట్టాముదం.

సేవకుడు : చిత్తం. రావయ్యా రా. (సేవకుడు లాక్కుపో తుంటే అతను ఏడుస్తూ పోతాడు. మరొక సేవ కుడు ప్రవేశించి మరొక నేరస్తుణ్ని ముందుకు తీసుకు వస్తాడు)

వెంకట్రావు : ఇతను చేసిన నేర మేమిటి ?

సేవకుడు : తన తమ్ముణ్ని హత్య చేశాడండీ.

వెంకట్రావు : ఎందుకు చేశావోయ్ ? అన్నదమ్ములే కలిసి వుండకపోతే రాజ్యాలు యెట్లా నిలుస్తాయ్ ? సంఘం ఏం కావాలి ?

హంతకుడు : నా పొలం కలుపుకోవాలని గట్టు జానెడు నరి కాడు. అన్న సని వాడికి వుందీ ?

వెంకట్రావు : గట్టు నరికాడని హత్య చేస్తావా ?

హంతకుడు : ప్రక్కచే నని గట్టు నరకలా వాడు ? చూస్తూ వూరుకుంటే నా పొలం అంతా కలుపుకుంటాడు. ఆ స్తంతా పోయినతర్వాత నేను చచ్చేం ? బతికేం ?

వెంకట్రావు : అందుకని నిండుప్రాణం తీస్తావా ?

హంత : తియ్యక ?

వెంకట్రావు : తమ్ముడని అయినా చూడక పోయావ్ ?

హంత : ఆస్తి దగ్గర తమ్ముడేమిటి ? అన్నేమిటండీ ?

వెంకట్రావు : [సాలోచనంగా] ఇతడు మానవుని ప్రాణం కంటే డబ్బే ప్రధాన మనే అజ్ఞానంలో వున్నాడు. 'మానవుని ప్రాణం నిలపటానికే డబ్బు' అనే సత్యం యితనికి తెలియజెయ్యాలి. ఇతని భార్యా బిడ్డల్ని ఇతన్నుంచి విడదీసి యితనిడబ్బుకు మారకం లేకుండా చెయ్యండి.

సేవకుడు : చిత్తం. [సేవకుడు హంతకుణ్ణి తీసుకు వెళ్తుండగా మొదటి సేవకుడు మరొకణ్ణి తీసుకొస్తాడు]

వెంకట్రావు : యితనెవరు ?

సేవకుడు : ఒక కవండీ.

వెంకట్రావు : ఒక్కడే వచ్చాడేం ? మిగిలిన కవులంతా ఏరీ?

సేవకుడు : మిగిలినవారు మాకు దొరకలేదండి. కొంతమంది ఇంట్లోవుండి లేరనిపించారండి. కొంతమంది యిదుగో వస్తామని చెప్పి అయిపులేకుండా పారిపోయారండీ.

వెంకట్రావు : (నవ్వి) జబ్బునయమైతే కవిత్వం రాయలేమని వారి భయం. సరే వాళ్ళకర్మ. ఇతను చేసిన నేర మేమిటో చెప్పు?

సేవకుడు : యితర్లు రాసిన మంచిమంచి రచనలు తన పేరుతో ప్రకటించు కుంటాడండీ.

వెంకట్రావు : ఏమయ్యా నీ కిదేంరోగం ? ఇది నిజమేనా ?

కవి : నిజమే. (అతిశ్రావ్యంగా)

వెంకట్రావు : ఎందు కలా చెయ్యటం ?

కవి : అందమైన వస్తువుల్ని నా సొంతం చేసుకుంటాను. నేను మహాసముద్రాన్ని. ప్రపంచంలోవున్న అందా లన్నీ నావే. అవి నాలో అలలుగా వుండాలి.

వెంకట్రావు : నీ కేమైనా పైత్యమా ? అడిగింది చెప్పు. ఎందుకు దొంగతనం చేస్తున్నావ్ ?

కవి : నీబోటి వాళ్ళకు అది దొంగతనం. నాకది తీరని కాంక్ష.

వెంకట్రావు : (సేవకునితో) ఏయ్ !

సేవకుడు : అయ్యా !

వెంకట్రావు : యితనితో నిజం చెప్పించు.

సేవకుడు : కవిగారూ, కవిగారూ (చొక్కా చేతులు పైకి తీస్తూ, కవి పైపైకి వెళ్తుంటాడు)

కవి : దూరం ...... అతిమాత్రదూరం (అతను ఆగక పోవటంచూసి) యితని హస్తాలవల్ల మలినమైన దానికంటే నిజంచెప్పటమే ఉచితమని నిశ్చయించు కున్నాను.

వెంకట్రావు : చెప్పూ ! !

కవి : నాకొక ప్రేయసి వుంది.

వెంకట్రావు : లేసదెవరికయ్యా ?... ! [సేవకుడు బిగ్గరగా నవ్వుతాడు]

కవి : ఆమె అభిమానంకోసం ...

వెంకట్రావు : ఆమెకోసం అవినీతికి పాల్పడతావటయ్యా ?

కవి : అగ్నికి పాపంఅంటనట్లు ప్రేమోపాసకునకు అవినీతి అంటదు.

> వాటుప్రేయసి ముం దనంత ప్రపంచ
> దివ్యసౌందర్య భావనల్ తీసికట్టు
> ఆమెకన్నులు బ్రహ్మ విద్యారహస్య
> ములు, మదీయ.... .... .... .... ....

వెంకట్రావు : [సేవకునితో] ఏయ్ !

సేవకుడు : అయ్యా ?

వెంకట్రావు : యితనిజబ్బు చాలా ముదిరింది,

సేవకుడు : అవునయ్యా. మొన్న ఆడపిల్లలు బడికి వెళ్ళు తుంటే వాళ్ళమధ్యకు వెళ్ళి 'ప్రేయసీ'...'యసీ'... 'సీ'... అని భజనమొద లెట్టాడు.

వెంకట్రావు : ఇతన్ని ఒక మహిళామండలిముందు గేట్లో బిళ్ళ బంట్రోతుగా పెట్టి, తలమీద అర్ధణా వెడల్పున జుట్టుతీయించి, నిత్యం నిమ్మరసం రుద్దించు.

సేవకుడు : చిత్తం... [కవి 'నాదుప్రేయసీ' అనే పై పద్యం పాడుకుంటూ వెళ్తాడు]

వెంకట్రావు : ఇవాళకు యిక కోర్టు చాలిద్దాం. మిగిలిన వాళ్ళని రేపు విచారిద్దాం.

ఒకడు : [ప్రవేశించి] వెంకట్రావుగారూ !

వెంకట్రావు : ఆఁ.

ఒకడు : తమకొత్త సిద్ధాంతాన్ని తెలుసుకోవాలని ప్రజలు క్లబ్బుదగ్గర గుమిగూడారు. తమరొక్కసారివచ్చి...

వెంకట్రావు : తప్పకుండా వస్తాను. ఉపన్యాసాలద్వారా ప్రజల్లో ప్రచారం చెయ్యాలని నేనూ అనుకుంటున్నాను.

* * *

[కాసేపు తర్వాత క్లబ్బుముందు వెంకట్రావు ఉపన్యసిస్తుంటాడు.]

వెంకట్రావు : మానవుడికి ఆలోచించుకునే శక్తివుంది. ప్రపంచాన్ని అర్థం చేసుకునే జ్ఞానం వుంది. అయినప్పటికీ కొంతమంది [illegible] పనులు చేస్తూవుంటారు. అనేక [illegible] చేస్తూ సాంఘికజీవి

తాన్ని భగ్నం చేస్తూవుంటాను. ఎందుకని? కొంత మంది సన్మార్గులు; కొంతమంది దుర్మార్గులు సంఘంలో వుండటానికి కారణంఏమిటి? దుర్మార్గుల్ని లేకుండా చెయ్యడానికీ, వారినిమార్చి సన్మార్గంలో పెట్టటానికీ ఏమైనా వీలుందా? నే నీవిషయం దీర్ఘంగా ఆలోచించాను.

ఒకడు : ఆలోచనే! ఓరిబాబో! నువ్వెప్పుడు మొదలు పెట్టావయ్యా ఆలోచించటం?

వెంకట్రావు : నే చెప్పేది సావకాశంగా వినండి. వినకుండా హేళన చేయవద్దు. మనకు మల్లేనే చెప్పుల్లేకుండా తిరిగే వీడు, మనకుమల్లేనే రోజూ కాఫీ త్రాగే వీడు, యింత గొప్పవాడు యెప్పుడయ్యాడా, అని ఆశ్చర్య పడ నవసరం లేదు. చెప్పుల్లేకుండా తిరగటం; చెప్పుల్లేకుండా తిరగటమే. గొప్పతనం; గొప్పతనమే. దానికీ దీనికీ యేమీ సంబంధం లేదు.

ఒకడు : హియర్ హియర్.

మరొకడు : ఊకదంపుడు కట్టిపెట్టి నీవు చెప్పవలసింది చెప్పవయ్యా.

వెంకట్రావు : నన్ను చెప్పనివ్వండి మరి.

ఒకడు : చెప్పూ?

వెంకట్రావు : నా అనుభవాన్నిబట్టీ, నేను సంపాదించిన జ్ఞానాన్నిబట్టీ మానవుడు నేరాలు చెయ్యటానికి అతని మనస్సే కారణమని తేల్చుకున్నాను.

ఒకడు : ఆ సంగతి అందరికీ తెలుసు. నువ్వు చెప్పేదేమిటి ?

వెంకట్రావు : తెలిసి వుండవచ్చు. మనస్సు కారణమైన ప్పుడు–మనస్సును మారిస్తే తప్ప–మానవుడు నేరాలు చెయ్యకుండా వుండలేడు.

ఒకడు : ఆ సంగతీ అందరికీ తెలుసునే్లవోయ్. కాని యెట్లా మార్చాలో చెప్పు.

వెంకట్రావు : అదే చెప్పుతున్నాను. మనస్సు వంశ పారం పర్యావచ్చే ఆలోచన్లనుబట్టీ, శారీరక స్థితినిబట్టీ, పరిస్థితుల్నిబట్టీ, అప్పుడు సంఘంలో వుండే సంస్కా- రాన్నిబట్టీ ఏర్పడుతుంది. వీటిని అర్థం చేసుకుని, నేరాలు చేసే మనస్తత్వం యేర్పడటానికి కారణం తెలుసుకుని, దాన్ని నిర్మూలిస్తే సంఘం బాగుపడు తుంది. వంశ పారంపర్యా వచ్చే ఆలోచన్లు మాన వుడికి ఒక దృష్టిని కలిగిస్తవి. ఆ దృష్టి సంఘానికి చెరుపు చేసేటట్లయితే, భిన్నానుభవాలవల్ల దాన్ని మారుస్తాం. పరిస్థితులవల్ల చెడు ఆలోచన్లు కలిగే టట్లయితే పరిస్థితులు మారుస్తాం. శారీరక తత్వంవల్ల అపాయకరమైన బుద్ధులు పుట్టేట్లయితే మందు లుప యోగించి, తత్వాన్ని మార్చి – ఆరోగ్యాన్ని ప్రసా దిస్తాం. వీటన్నిటికంటే ప్రచారంలో వున్న సంస్కా- రానికి మానవునిమీద ఎక్కువ అధికారం వుంటుంది. నిత్య జీవితంలో అడుగడుక్కీ యీ సంస్కారం మానవుడి మనస్తత్వాన్ని మారుస్తూ ఉంటుంది. ఈ సంస్కారంవల్ల మానవుడికి నష్టం జరిగితే, జ్ఞానా

భివృద్ధి కలిగించి మన స్తత్వాన్ని మార్చి కొత్త సంస్కారం ఆచరణలోకి వచ్చేటట్లు చేస్తాం. అప్పుడు మానవుడు సంకెళ్ళను త్రెంచుకొని పరిపూర్ణత్వాన్ని పొందుతాడు. సంఘంలో నేరాలు చేసేవాళ్ళే వుండరు. ప్రపంచం యిప్పుడున్న తగాదాలకు, స్పర్థలకు, కలహాలకు అతీతమై వాసయోగ్య మవుతుంది. ఈ కొత్త పద్ధతికి మొదట్లో మామూలు ప్రజలు యెదురు తిరుగుతారని నాకు తెలుసు. కాని మీ బోటివాళ్ళు, జ్ఞానం – సంస్కారం కలిగినవాళ్లు, నా అండను నిలిస్తే నే నీపని తేలిగ్గా సాధించగలనని నా విశ్వాసం.

[కరతాళధ్వనులు. "మేము నీకు సహాయం చేస్తాం. తప్పకుండా చేస్తాం. జై వెంకట్రావుగారికీ జై జై. విచిత్రప్రక్రియకూ జై" నిద్రపోతున్న వెంకట్రావు వులిక్కిపడి లేస్తాడు. కెవ్వున కేక వేస్తాడు. భార్య గాభరాగా కళ్ళు నలుపుకుంటూ లేచి వస్తుంది]

వెం. భా : ఎందుకండీ అట్లా వులిక్కిపడి లేచారు ?

వెంక : ఆఁ ... ఆఁ ... ఆఁ ... ...

వెం. భా : ఎందు కట్లా ఒణికిపోతున్నారు ?

వెంక : అబ్బెబ్బే ! ఒణకట మేముంది ?

వెం. భా : పడుకోండి. నా కేదో భయంగావుంది.

వెంక : నాకూనూ.

వెం. భా : ఎందుకూ ? ఏమయినా పీడకల వచ్చిందా ?

వెంక : ఆఁ ... ... ఏమిటీ ?

వెం. భా : పీడకల ఏమైనా వచ్చిందా అంట ?

వెంక : నేను డాక్టరుగారి దగ్గరకు వెళ్లాలి.

వెం. భా : యింత రాత్రి? ఇప్పుడేం తొందరండీ. అమ్మాయి ఖులాసాగా నిద్రపోతూవుందిగా.

వెంక : మన అమ్మాయి ఖులాసాగా వుంటే సరే; యిటువంటి అమ్మాయిలు లక్షలున్నారు ప్రపంచంలో. వారి కోసం వెళ్లాలి.

[తలుపు కొట్టిన ధ్వని]

డాక్టరు : (బయటనుంచి) వెంకట్రావుగారూ ?... ... వెంకట్రావుగారూ ?

వెంక : ఎవరో పిలుస్తున్నట్లున్నారు.

వెం. భా : ఇంత రాత్రివేళ ఎవరికేం పనుంటుంది ? ఏ ఊళ్లోనో బుర్రలు బద్దలు కొట్టుకుని వుంటారు. మీ సలహాలకోసం వచ్చివుంటారు.

డాక్టరు : (తలుపు గుద్దుతూ) వెంకట్రావుగారూ ? ... వెంకట్రావుగారూ ?

వెంక : డాక్టరుగారి లాగున్నారు (వెళ్తాడు)

వెం. భా : అయ్యో రామా, ఏం కర్మం వచ్చిపడిందో ! ఈ అర్ధరాత్రివేళ డాక్టరుగారు రావటమేమిటి ? ఈయన వెళ్ళటమేమిటి ?

[ తలుపు దగ్గర ]

డాక్టరు : (బయట) వెంకట్రావుగారూ! (వెంకట్రావు లోపలినుంచి ప్రవేశించి తలుపుతీసి)

వెంక : డాక్టరుగారా ! రండి. రండి. యిట్లా కూర్చోండి. ఏమిటీ అర్ధరాత్రివేళ వచ్చారు ?

డాక్టరు : ఆఁ... ఏదో తోచక...

వెంకట్రావు : అట్లా వున్నారేం ?

డాక్టరు : అబ్బే. ఏంలేదు. ఏదో... మీరట్లా కంగారుపడు తున్నారేం ?

వెంకట్రావు : అబ్బే, ఏంలేదు. ఏదో...

డాక్టరు : ఏదన్నావుంటే చెప్పండి. మీకునేనూ, నాకు మీరూతప్ప ఎవరున్నారు.

వెంకట్రావు : పెద్దవిషయం ఏమీలేదు. నాకు ఒక కల వచ్చింది.

డాక్టరు : కలా ?

వెంకట్రావు : ఏం ? ఆశ్చర్యంగా అడుగుతున్నారు ?

డాక్టరు : అబ్బే ! ఏం లేదు.

వెంకట్రావు : చెబుదురూ.

డాక్టరు : [సర్దుకుని] నాకూ ఒకకల వచ్చిందిలెండి.

వెంకట్రావు : కలే ? ! !

డాక్టరు : ఆఁ...కలే !

వెంకట్రావు : మీకూ్కడా వచ్చిందీ ?

డాక్టరు : ఆహా ! వచ్చింది.

వెంకట్రావు : ఏం వచ్చిందండీ ?

డాక్టరు : మనం అనుకున్న సంగతే. నేను శిక్షలుచెప్పి జబ్బులు నయం చేసినట్లు వచ్చింది.

వెంకట్రావు : నాకూ అట్లాగే వచ్చింది. నేను మందులిచ్చి మన స్తత్వాన్ని మార్చి నేరాలు రూపుమాపటానికి ప్రయత్నిస్తున్నట్లు వచ్చింది.

డాక్టరు : [ఎగా దిగా చూసి] విచిత్రంగానేవుంది, వెంకట్రావుగారూ.

వెంకట్రావు: యిలా జరగటానికి వీలుంటుం దంటారా డాక్టరుగారు?

డాక్టరు : ఎందుకు లేదు ?

వెంకట్రావు : అయితే యీనూత్నసిద్ధాంతాన్ని ఆచరణలో పెడదామంటారా ఏవిఁటి ?

డాక్టరు : పెడితే బాగుండే టట్లుంది.

వెంకట్రావు: నాకెందుకో భయంగావుందండీ డాక్టరుగారూ.

డాక్టరు : భయమూ ?

వెంకట్రావు : అవును.

డాక్టరు : ఊఁ. నాకుమాత్రం భయంగాలేదంటారా; ప్లీడరు గారూ ? డాక్టరుకీ, ప్లీడరుకూ పిచ్చెంత్తిం దని మన మొహాలు ఎవ్వరూ చూడరు.

మూర్తి : [చదువుతున్న గ్రంథంతో ప్రవేశించి] మీరు చేయదలచుకున్న పని మంచిదని మీకు తెలుసు. కాని చెయ్యటానికి భయపడుతున్నారు. ఎందుకని? యిదొకజబ్బు. మన స్తత్వానికి సంబంధించినజబ్బు.

ఇటీకగల మన స్తత్వాన్ని మార్చటానికి ప్రయత్నించే ముందు ప్రచారకులు తమజబ్బుల్ని నయంచేసుకో వాలని యీ గ్రంథకర్త చెప్పాడు. ముందు మీ జబ్బు నయం చేసుకోండి. కావలసిన ధైర్యంవస్తుంది. అప్పుడు కార్యరంగంలోకి దిగుదురుగాని.

వెంకట్రావు : మా మనస్తత్వాలకే జబ్బుగా వుందంటావా మూర్తీ ?

మూర్తి : అవును. లేకపోతే మంచి పని చెయ్యటానికి భయ మెందుకు ?

వెంకట్రావు : సంఘం !

మూర్తి : అదే జబ్బు. అసంఖ్యాకుల సుఖం కంటే, మీ సుఖమే మీకు ముఖ్యంగా కనిపిస్తూ వుంది.

వెంకట్రావు : అయితే చికిత్స మాతోనే మొదలుపెట్ట మంటావ్ ?

మూర్తి : తప్పకుండా.

వెంకట్రావు : ఏమంటారు, డాక్టరుగారూ ?

డాక్టరు : బాగానే వుంది ప్లీడరుగారూ. ముందు మనతో మొదలు పెడదాం. ఈ విచిత్రప్రక్రియ, ముందు మనకు మంచి పని చెయ్యటానికి భయం పోవాలి.

[ ప్లీడరు ఆలోచిస్తూ వుంటాడు. ]

....o....

పాత్రలు:

ధృతరాష్ట్రుడు
సంజయుడు
కృష్ణుడు
అర్జునుడు
దుర్యోధనాదులు
ధర్మరాజాదులు

(11)



త్వమక్షరం పరమం వేదితవ్యం
త్వమస్య విశ్వస్య పరం నిధానం
త్వమవ్యయ శ్శాశ్వత ధర్మగోప్తా
సనాతనస్త్వం పురుషో మతో మే.



# విశ్వరూప సందర్శనం

[ధృతరాష్ట్రుని రాజప్రాసాదం. సంజయుడు
మహాభారత యుద్ధవార్తలు చెప్తుంటాడు]

ధృతరా : సంజయా! యుద్ధవార్తలేమి? ధర్మక్షేత్రమైన కురుక్షేత్రం ఏవిధంగా వుంది? నావారైన దుర్యోధనాదులు, ధర్మరాజాదులైన పాండవులు ఏమి చేస్తున్నారు?

సంజయ : ధృతరాష్ట్ర మహారాజా! ఇరువాగులవారూ తమ తమ బలాలను సేకరించుకుని యుద్ధానికి సిద్ధంగా నిలబడ్డారు. కౌరవసైన్యానికి భీష్మాచార్యుడు సేనాధిపతి. పాండవసేనకు ధృష్టద్యుమ్నుడు సేనాధిపతి. భీష్ముని ఆధిపత్యాన్ని గురించి ఏమనుకుంటున్నాడో తెలుసుకోవాలని నీ కుమారుడు ద్రోణాచార్యుని దగ్గరకు వెళ్ళి ఏమంటున్నాడో విను—

[కౌరవసైన్య కోలాహలం, అనేక వినాదాలు విని పిస్తయ్. బూరలు, భేరులు, తప్పెటలు, సింగి నాదం, మొదలైనవి ముమ్మరంగా వినిపిస్తయ్]

దుర్యో : ద్రోణాచార్యా! పాండవసేనను చూశావా? నీ శిష్యుడూ, బుద్ధిమంతుడూ అయిన ధృష్టద్యుమ్నుని చేత ఏవిధంగా రక్షింపబడుతూ వుందో! ఆసైన్యంలో భీమార్జునులతో సములైన రణవిశారదులు, మహా

రథులైన యుయుధానుడు, సాత్యకి, విరటుడు, ద్రుప దుడు, దృష్టకేతుడు, చేకితానుడు, కాశీరాజు, అభి మన్యుడు, ద్రౌపదీపుత్రులూ వున్నారు.

ద్రోణా : సరి ( ఎకసెక్కెంగా అంటాడు )

దుర్యో : అంటే మనవారిలో యోధులు లేరనికాదు ఆచార్యా. తామూ, భీష్ముడూ, కర్ణుడూ, కృపుడూ, అశ్వత్థామా, వికర్ణుడూ, భూరిశ్రవుడూ మొదలగు యుద్ధవిశారదులు, శస్త్రాస్త్ర ప్రవీణులు మనపక్షం లోనూ వున్నారు. వీరందరూ నాకోసం ప్రాణాలు అర్పించటానికి సిద్ధంగావున్నారు. మనబలం అపార మైనది. పాండవుల బలం పరిమితమైనది.

ద్రోణా : దుర్యోధనా ! జయాపజయాలు దైవాధీనాలు. నీ విజయం కోసం శక్తివంచలేకుండా పాటుపడతాం. ద్రుపదుని సంతతి పాండవసేనలో వున్నంతకాలం యీ యుద్ధం నాదిగానే భావించుకుంటున్నాను.

దుర్యో : గురువర్యా ! తమరి స్వభావం, నైపుణ్యాం నాకు క్రొత్తవా ? కృతజ్ఞుణ్ణి. (అనతిదూరంనుంచి భీష్ముడు బిగ్గరగా సింహనాదంచేసి శంఖంపూరిస్తాడు) అదుగో, సేనాధిపతి శంఖారావం. సైనికులారా! మీఅందరూ మీ నియమితస్థానాల్లో నిలబడి భీష్ముని జాగ్రత్తగా కాపాడండి. (తనలో) శిఖండివే ప్రమాదం.

[శంఖములూ, భేరులూ, తప్పెటలూ, రణభేరులు ముమ్మ రంగా మ్రోగుతై. శంఖధ్వనులు ప్రత్యేకంగా వినిపిస్తవి.]

ధృతరా : సంజయా, సంజయా! ... శరీరాన్ని గగుర్పొడిపించే ఆ శంఖధ్వనులు ఎవరివి ?

సంజ : కృష్ణార్జునులవి. ఆ శంఖనాదాలకు కౌరవసైన్యం ఏ విధంగా కలవరపడుతూవుందో విను.

[కౌరవ సైన్యంలో గుసగుసలు. "కృష్ణార్జునులు, కృష్ణార్జునులు" అని ఒకరిచెవులో మరొకరు చెప్పుకుంటూవుంటారు]

ధృత : సంజయా! ఈ యుద్ధం ఆపటానికి నే నెంతపాటు పడ్డానో నీకు తెలుసు. కులక్షయం అని చెప్పాను. గాంధారితో చెప్పించాను. దుర్యోధనుడు నామాట వినలేదు. శ్రీకృష్ణుడైనా యీ యుద్ధాన్ని తప్పించలేకపోయాడు. ఇంతకూ పాండవుల సన్నాహాలను గురించి చెప్పక పోతివి ?

సంజ : విను, ధృతరాష్ట్ర మహారాజా! విను. తమ సైన్యం ముందు నిలబడి ధర్మరాజాదులు మాట్లాడుకునే మాటలు—

[పాండవ సైన్యం; సైనికుల కోలాహలం]

ధర్మ : ధృష్టద్యుమ్నా! వ్యూహం పూర్తి అయిందా ?

ధృష్ట : చక్కగా అమరింది.

భీముడు : కౌరవబలాన్ని నుగ్గునూచం చెయ్యటానికికూడా వ్యూహం కావాలా ? నా భుజబలం చాలదూ ? నా చేతులకు తగిన ఆహారం నేటికి దొరికింది. ద్రౌపదిని నిండుకొలువులో అవమానపరచిన దుర్యోధన దుశ్శాసనుల నెత్తురుత్రాగి నా పంతం నెరవేర్చుకునే సమ

యం నేటి కాసన్నమైంది. (హఠాత్తుగా దూరం నుంచి పాంచజన్యం వినబడుతుంది)

ధర్మ : అడుగుగో, తమ్ముడు అర్జునుడు యిటే వస్తున్నాడు. (భీమసేనుడు భూమ్యాకాశాలు దద్దరిల్లేటట్లు పౌండ్ర మును పూరిస్తాడు. పాంచజన్యారవం క్రమ క్రమేణా దగ్గరకువచ్చి ఆగుతుంది)

అర్జు : అన్నా! బాణాలకు రెక్కలువచ్చినవి. నన్ను దీవించి పంపు.

ధర్మ : మంచిది నాయనా! శుభమస్తు.

అర్జు : బావా! రథాన్ని యిరుసేనలమధ్యకు తోలు. ఒక్క సారి నే నెవరెవరితో యుద్ధం చేయాలో చూడాలని వుంది.

శ్రీకృష్ణు : అట్లాగే.

ధర్మ : కృష్ణా! మేనమరది జాగ్రత్త.

శ్రీకృష్ణు : నాదేముంది ధర్మరాజా? నేను వట్టి రథ చోద కుడను.

[రథం కదిలింది. అశ్వాలు పరువెత్తుతున్న చప్పుడు. చప్పుడు క్రమక్రమేణా తగ్గుతుంది. అశ్వాలు ఆగుతవి]

అర్జు : అదుగో దుర్యోధన దుశ్శాసనులు. అదుగో తాత భీష్ముడు. కురువానికంటే వుత్సాహంగా వున్నాడు. అదుగో గురుపాదులు ద్రోణాచార్యులు. అదుగో మేనమామ శల్యుడు. అదుగో లక్ష్మణ కుమారుడు.

(విషాద సంగీతం)కృష్ణా యిం దెవరితో యుద్ధంచెయ్య మంటావు ?

శ్రీకృష్ణు : అందరితోనూ. (అర్జునుణ్ణి తేరిపారజూస్తాడు)

అర్జు : (కలయజూస్తూ) అందరూ నావారే!! పెంచినవా డొకడు, ప్రేమాతో ఆటలాడించినవా డొకడు... విద్య గరపినవా డొకడు....... అయ్యొయ్యో....... స్వలాభంకోసం వీరి నెలా చంపేది ?

శ్రీకృష్ణు : ఏమిటిది అర్జునా ? ఏమిటి నువ్వు మాట్లాడేది ?

అర్జు : బావా ! కృష్ణా ! యీ నెత్తురుకూడు నాకువద్దు. స్వజనులను జంపి నేను పొందే దేమున్నది?...నాకు జయంవద్దు...రాజ్యాలువద్దు. సుఖాలువద్దు. తండ్రులను, తాతలను, కుమారులను, మనుమలను నేను చంపలేను.

[చతికిలపడి గాండీవం జారవేస్తాడు]

శ్రీకృష్ణు : బావా ! బాగుంది ! రథాన్ని వెనక్కు నడపమంటావా? సైన్యాన్ని తిరుగుముఖం పట్టించమంటావా? చెప్పు... నేను రథచోదకుడను. నీ ఆజ్ఞలను పాలించటమే నావిధి...(నవ్వి) యిది జ్ఞానం అనుకుంటున్నావేమో. ఇది వట్టి వ్యామోహం సుమా ! వీరు నీ బంధువులుకాక పరులైతే చంపగలవా? అప్పుడు లేని పాపం యిప్పు డెక్కడనుంచి వచ్చిందయ్యా ?

అర్జు : నన్ను అపహాస్యం చెయ్యకు బావా !

శ్రీకృష్ణు : నువ్వింత పిరికివాడవని అనుకోలేదు.

అర్జు : ఇది పిరికితనమే కావచ్చు. కాని నిజంగా నాకు కాళ్ళూ, చేతులూ ఆడటంలేదు. భీష్ముని మీద ఏ మొహం పెట్టుకుని నేను బాణాలు వేసేది? లక్ష్మణ కుమారుణ్ణి నే నేవిధంగా హత్యచేసేది? రాజ్యకాంక్ష చేత దుర్యోధనుడు యీ హత్యాకాండకు సిద్ధపడ్డా డని మనం అతన్ని నిందుస్తున్నాంగదా! మేము ఆయనకంటే ఏవిధంగా మెరుగు? మేము మాత్రం చేసేపని ఏమిటి?...ఏమో బావా! నా మనస్సు చెడింది. నాకు ఏది ధర్మమో, ఏది అధర్మమో తెలియటంలేదు.

శ్రీకృష్ణు : ఆ సంగతి తెలుస్తూనేవుంది.

అర్జు : నేను యుద్ధం చెయ్యలేను బావా!

శ్రీకృష్ణు : మ రేంచేస్తావు?

అర్జు : భోగాలను త్యజించి తాపసవృత్తి నవలంబిస్తాను.

శ్రీకృష్ణు : ఇవి నీమాటలు కావు. ధర్మరాజు మాటలు. వాటి పూర్తి అర్థం తెలుసుకోకుండా పునశ్చరణ చేస్తున్నావు.

అర్జు : నేను ఆయన సోదరుణ్ణి. ప్రియ సోదరుణ్ణి. యుద్ధం తప్పించుకోటానికి ఆయన చేసిన ప్రయత్నానికి కారణం, ఆయన భావాల ఔన్నత్యం, యిప్పుడు నాకు తెలుస్తూవుంది. యుద్ధం కాంక్షించటానికీ, యుద్ధాన్ని ప్రత్యక్షానుభవంలోకి తెచ్చుకోటానికీ, ఎంత భేదం వుంది? (శ్రీకృష్ణునివైపు తిరిగి) యింత

దారుణ హత్యాకాండమీద ఆధారపడిన భోగాలు నాకు వద్దు కృష్ణా.

శ్రీకృష్ణు : వ్యామోహంలో పడి యిట్లా అంటున్నావుగాని నీవు భోగాలను త్యజించలేవు అర్జునా. నీవు క్షత్రియుడవు. నీ రక్తం క్షత్రియ రక్తం. నీవు చిన్నప్పటి నుంచీ యుద్ధానికి తగిన సంస్కారాన్ని అలవరచుకున్నావు. అటువంటి యుద్ధమే నీవు చెయ్యలేకపోతే నీ సంస్కారానికి యే మాత్రం సరిపడని తాపస వృత్తిని యే విధంగా నిర్వహిస్తావయ్యా? స్వధర్మాన్ని నిర్వహించలేనివాడు పరధర్మాన్ని నిర్వహించ గలుగుతాడనే మాట వట్టిమాట. ఈ మాటలకేంగాని, గాండీవాన్ని చేతబట్టి శత్రు సైన్యాన్ని నురుమాడు. ఇహమూ, పరమూ రెండూ నీకు అందుబాటులోకి వస్తవి.

అర్జు : లేదు బావా! నువ్వు వెయ్యి చెప్పు, లక్ష చెప్పు. నేను యీ ఘాతుక కృత్యానికి దిగలేను.

శ్రీకృష్ణు : (విసుగు నటిస్తూ) అయితే ద్వారకలో వున్న నన్ను యిక్కడికి యెందుకు తీసుకొని వచ్చావు? ఈ రథచోదకత్వానికి నన్నెందుకు ఆహ్వానించావు? మీతోపాటు నన్ను కూడా నవ్వులపాలు చెయ్యటానికా?

అర్జు : క్షమించు బావా! నేను చంపలేను.

శ్రీకృష్ణు : మాటిమాటికీ చంపలేనని ప్రగల్భాలాడుతున్నావు. చంపేదెవరు? చచ్చేదెవరు? వీరిని చావ

కుండా నీవు కాపాడగలవా? చచ్చిన వాడిని నీవు బ్రతికించగలవా? చచ్చేవారందరూ నీ వల్లనే చస్తున్నారా? బ్రతికేవాళ్ళందరూ నీవు వదలిపెట్టినందు వల్లనే బ్రతుకుతున్నారా? ఎందుకు బావా, యీ తిరుగుడు మాటలు? ఎవరు చేసిన పనుల ఫలితాలు వారికి వాటంతట అవే కలుగుతవి. ఏనాడు దుర్యోధనాదులు అన్యాయానికి పూనుకున్నారో ఆనాడే వారికి మరణశయ్య సిద్ధమైంది. వారు చేసిన పనులే వారిని నాశనం చేసే శక్తులను సృష్టించినవి. నీవు సేవా? కాదు... దుర్యోధనాదుల పనులు నీ స్వభావాన్ని యెంత మార్చలేదు? వారు చేసిన పనులే వారి మరణానికి దారి తీస్తున్నవి. ఇక వారు జీవించటానికి వీల్లేదు. ...

అర్జు : ఏమో బావా, వారికి మరణం ఎలాగూ తప్పనప్పుడు ఆ పని నా చేతులమీదుగా ఎందుకు చెయ్యాలి?

శ్రీకృష్ణు : ఆ మరణానివి నీవే గనుక.

అర్జు : ఏమిటి బావా!

శ్రీకృష్ణుడు : అవును. అది నీ ధర్మం. నీ ధర్మాన్ని నిర్వర్తించటం నీకు శ్రేయస్సు. దుర్యోధనుడు తన పూర్వ కర్మలవల్ల తన అధర్మాన్నుంచి యెలా తప్పుకోలేడో, నీవూ అదేవిధంగా నీ ధర్మాన్నుంచి తప్పుకోలేవు. దుర్యోధనునితో అధర్మం చేయించిన శక్తే నీతో ధర్మం చేయిస్తూ వుంది.

అర్జు : ఎందుకు? దేనికోసం బావా?

శ్రీకృష్ణు : అభివృద్ధికోసం......గమ్యస్థానం చేరుకోవటం కోసం. బావా, ప్రపంచం పరిణామం చెందటానికి యిదే మార్గం. ఈ దుష్టశిక్షణా, ఈ మరణాలూ, మానవజాతిని పై మెట్టుకు తీసుకుపోతాయి. ఈ పరిణామానికి ధర్మం చేసేవారు యెంత సహాయపడుతున్నారో, అధర్మం చేసేవారూ అంతే సహాయపడుతున్నారు. కాని ధర్మం జయించాలి. లేకపోతే లోకం పతన మవుతుంది. అందుకని నీ కీ యుద్ధం తప్పదు. ఈ యుద్ధం నీవు చెయ్యకపోతే, ధర్మచ్యుతికి నీవే కారణభూతుడ వవుతావు. హే అర్జునా! నీవ్వూ, నేనూ అనే భేదం కల్పితం. నీలో, నాలో, ఈ సమస్త లోకంలో వున్న శక్తి ఒక్కటే. నీవే నేను, నేనే నీవు. (అర్జునుడు బిత్తరపోయి చూస్తుంటాడు) అవును బావా, అన్నీ నేనే. ఈ కనపడే నేను అనిత్యం. కనపడని నేనే నిత్యం. ఆ నిత్యమైనది అన్నిటా ఒక్కటే. దానికి మరణం లేదు. నీవు చంపేది యీ అనిత్యమైన రూపాలనే. రూపాలు యెప్పుడూ అనిత్యమే. నీవు ధర్మం కోసం యీ యుద్ధం చేస్తున్నావు. కనుక అధర్మాన్ని నశింపు చేస్తున్నావు. నూతన పరిణామానికి దారి తీస్తున్నావు. అది నీ విధి. నేను చంపుతున్నానని నీవు అనుకోనక్కరలేదు. చంపుతున్నదీ లేదు; చస్తున్నదీ లేదు. భ్రమ పడకు, నిత్యమైనది చంపబడదు. ఆ నిత్యమైనది అన్నిటిలోనూ ఒక్కటే. అదే నేను. నేనే అన్నిటికీ కారణ భూతుడను. నేనే అన్నిటినీ.

అర్జు : బావా !

శ్రీకృష్ణు : ఆఁ.......

అర్జు : నాకు నీవు అర్థం కావటంలేదు.

శ్రీకృష్ణు : ఆలోచించు. ఇందులో యేముంది ?

అర్జు : అయితే నీవూ, నేనూ ఒకటేనా బావా ?

శ్రీకృష్ణు : కాక ?

అర్జు : అయితే నీవే చంపరాదూ ?

శ్రీకృష్ణు : నీలో వుండి చంపుతున్నది నేనే. నేను కానిది యీ ప్రపంచంలో లేదు. దుర్యోధనుడను నేనే. అర్జునుడను నేనే. సూర్యుడను నేనే. చంద్రుడను నేనే. ఇంద్రుడను నేనే. ఐరావతాన్ని నేనే. నేనే హిరణ్యకశిపుడను. ప్రహ్లాదుడను. నేను పుట్టుకను. మృత్యువును. మోసగాండ్ర జూదమును నేనే. తేజో వంతుల తేజస్సును నేనే...

[శ్రీకృష్ణుని శారీరక హద్దులు కరిగిపోతున్నట్లు అని పిస్తుంది అర్జునునికి. కళ్ళు యింతంత చేసుకుని చూస్తూవుంటాడు. ఆశ్చర్యంతో యిలా అంటాడు]

అర్జు : బావా ! బావా !... ...మాట్లాడవేమి ? నీ కన్నులు జ్యోతులువలె ప్రకాశిస్తున్నవి. ఇటుచూడు. నాకేదో కంపరం కలుగుతున్నది.

శ్రీకృష్ణు : భిన్నత్వాన్ని అధిగమించి చూడు అర్జునా!

అర్జు : అది నావశం కావటంలేదు బావా !

శ్రీకృష్ణు : భిన్నత్వంలో ఏకత్వం చూడు.

అర్జు : బావా ! కరుణించు !

శ్రీకృష్ణు : నా విభూతులను ఏకస్థానంలో చూడు.

అర్జు : ఆ శక్తిని ప్రసాదించు.

శ్రీకృష్ణు : ఇప్పుడు చూడు...... ఇటు...... ఇటు......

[శ్రీకృష్ణుని ఆకారం వెన్నెల వెల్లువ అవుతుంది. విశ్వవ్యాపిత మవుతుంది. అంతలో మెరుపులు, ఉరుములు.... ఎక్కడనుంచో కృష్ణుడు మాట్లాడుతున్నట్లు అనిపిస్తుంది. ఆకాశమే మాట్లాడుతుందా?]

ఓ అర్జునా ! ఆదిత్యులను, వసువులను, రుద్రులను, అశ్వినులను, మరుత్తులను, యింకా నీవు చూడని అనేక అద్భుతాలను చూడు.

[విధ్వంసన సూచకంగా, పెద్ద పెద్ద సంగీత ధ్వనులు]

అర్జు : కృష్ణా ! కృష్ణా ! యిదేమిటి ? నీవుతప్ప నాకీ ప్రపంచంలో ఏదీ కనపడటంలేదు. ఈ ప్రపంచం తప్ప నాకు నీవు కనపట్టంలేదు.

శ్రీకృష్ణు : ఓ అర్జునా ! నీవు చూడగోరిన అన్యమైన, చరాచర రూపమైన సమస్త జగత్తును నాలోచూడు.

[నిర్మాణ, విధ్వంసక శక్తుల ధ్వనులు]

అర్జు : ఆఁ!...ఏమిటి బావా! కృష్ణా ! నీ దేహంలో సకల దేవతలను, చరాచరభూత సమూహాలను, సృష్టికర్తను, సమస్త ఋషులను చూస్తున్నాను. ఒకప్రక్క సత్యం, ఒకప్రక్క అసత్యం; ఒకప్రక్క కటిక చీకటి, ఒకప్రక్క చిక్కని వెలుగు; ఒకప్రక్క జ్ఞానం,

ఒకప్రక్క అజ్ఞానం, ఒకప్రక్క నాశనం; ఒకప్రక్క నిర్మాణం; ఒకప్రక్క ఆనందం, ఒకప్రక్క శోకం; ఒకప్రక్క స్థితి, ఒకప్రక్క లయం......

[ విశ్వరూపంలో ]

ఒకడు : నరకండి... పొడవండి... చంపండి ... సర్వనాశనం చెయ్యండి. ఈ ప్రపంచం నాది. నా బాగుకోసమే మీరంతా జీవించాలి. అందుకు అంగీకరించని వాళ్ళు బ్రతకటానికి అర్హులు కారు. నరకండి... పొడవండి... చంపండి (ప్రజలరోదన)

ఇంకొకడు : ప్రేమే దేవుడు. ప్రేమను మించిన సత్యం మరొకటి లేదు. ప్రేమించు. నీతోటి జీవరాసులను ప్రేమించు. తప్పుచేసినవారిని క్షమించు. (ఆహ్లాదకరమైన సంగీతం)

ఒకడు : ధర్మంలేదు. సత్యంలేదు. ధనార్జనే పరమసత్యం. ఇందుకు ఎంతమందిని బలిచేయవలసివచ్చినా చెయ్యవలసిందే. నరకండి ... చంపండి ... పొడవండి... (రోదన)

ఇంకొకడు : సత్యంవద ... ధర్మంచర ... (ఆహ్లాద సంగీతం)

ఒకడు : వారు నాకు విరోధులు. వారిని హతమారుస్తాను. (రోదన)

ఇంకొకడు : వారు అధర్మం చేస్తున్నారు. వారికోసం నేను ఆహుతి అవుతాను.

[నిర్మాణ, విధ్వంసక శక్తులను సూచించే ధ్వనులు]

[విశ్వరూపం బయట]

అర్జు : కృష్ణా ... కృష్ణా ... కృష్ణా ... ఓ విశ్వేశ్వరా! విశ్వరూపా ... నీ రూపానికి మొదలుగానీ, మధ్యకానీ, తుదిగానీ నాకు కనిపించటంలేదు. నిన్ను ఆదిమధ్యాంతరహితునిగా, అనంతములైన బాహువులు కలవానిగా, చంద్ర సూర్యులు నేత్రములుగా గలవానిగా, ప్రజ్వలించెడుఅగ్ని, ముఖమందుగలవానిగా, స్వీయతేజస్సుచేత యీ విశ్వాన్ని తపింపజేసేవానిగా చూస్తున్నాను. ఓ మహాత్మా! భూమి, అంతరిక్షములమధ్య నడిమి ప్రదేశమూ, సకలదిశలూ, నీచేత నిండివున్నవి. భయంకరమైన నీ స్వరూపముచూచి ముల్లోకములు తల్లడిల్లుచున్నవి.

[ఫేడౌట్ అండ్ ఫేడిన్]

[విశ్వరూపంలో]

కర్ణుడు : అర్జునా, అర్జునా... అర్జును డెక్కడ? అర్జునునితో ముఖాముఖి యుద్ధం చేయాలని యీ కురుక్షేత్ర యుద్ధంకోసం అనేక సంవత్సరాలనుంచి కనిపెట్టుకుని వున్నాను.

[విశ్వరూపం బయట]

అర్జు : అదుగో కర్ణుడు. నీలో నాకోసం వెతుకుతున్నాడు. నేను కనుపించక పోయేటప్పటికి హతాశుడై తిరుగుముఖం పడుతున్నాడు. నాతో యుద్ధం చెయ్యాలనీ, నన్ను జయించాలనీ ఎంత తహతహ !!

[విశ్వరూపంలో]

దుర్యో : పాండవులకు సూదిమొన మోపినంత భూమి అయినా ఇవ్వను. వారికి భాగంపెట్టి నాతో సమాన ప్రతిపత్తి కల్పించే దానికంటే వీరమరణమే ఉత్తమం.

కొందరు : దుర్యోధన మహారాజుకూ... జై.

భీష్ముడు : ధర్మం పాండవులదే. కాని యీ యుద్ధంలో ధర్మాధర్మాలతో నిమిత్తం లేదు. కురువంశ ప్రతిష్ఠ కోసం నేను నాజీవితాన్ని అంకితం చేశాను. కురు వంశం నిలబెట్టే ప్రయత్నంలో అర్పణచేసుకుంటాను. కాబట్టి నామనస్సు పాండవులపైన వున్నా, నేను కౌరవపక్షాన నిలబడి పోట్లాడ్తాను.

[కోలాహలం]

ధర్మరాజు : నాయనలారా! ఈ యుద్ధాన్ని తప్పించ టానికి మనం శాయశక్తులా ప్రయత్నించాము. జన నష్టం నాకు యిష్టంలేనిపని అయినా యుద్ధం తప్ప లేదు. ధర్మాన్ని గెలిపించటానికి మనం యుద్ధం చేయాలి.

అర్జు : ధర్మమో, అధర్మమో. క్షత్రియవీరుడు యుద్ధానికి వెనుకంజ వేయకూడదు. మన అర్ధరాజ్యం కోసం నేను యుద్ధంచేస్తాను.

భీముడు : దుశ్శాసనుని నెత్తురు త్రాగటానికి, దుర్యోధనుని తొడలు విరుగగొట్టటానికి నేను యుద్ధంచేస్తున్నాను.

[కోలాహలం]
[విశ్వరూపం బయట]

అర్జు : ఆహా! అందరూ యుద్ధానికి సిద్ధమే. నేనూ సిద్ధమే. అయితే ఎవ్వరి సంస్కారాలకు సరిపోయే కారణాలను వారు సృష్టించుకుంటున్నారు. యుద్ధంమాత్రం తప్ప నట్లు కనిపిస్తుంది.
[నిర్మాణ, విధ్వంసక శక్తులను సూచించే సంగీతం]
అయ్యో, కృష్ణా! కురుక్షేత్రంలో చేరిన ధృతరాష్ట్ర పుత్రులూ, భీష్మద్రోణకర్ణులూ, మనపక్షపు యోధా గ్రేసరులూ, అందరూ, నదులూ ప్రవాహాలూ సము ద్రానికి అభిముఖంగా ప్రవహించేరీతిగా, ప్రజ్వ లిస్తున్న నీముఖాలకు అభిముఖులై ప్రవేశిస్తున్నారు. కోరలచేత భయంకరమైన. హాలాహలాగ్నికి సమా నములైన నీ రూపాలనుచూసి నేను భయపడు తున్నాను. ఓ దేవదేవా! ఇట్టి భయంకర రూపధారి వైన నీ వెవ్వరవు?

శ్రీకృష్ణుడు : లోక సంహారముచేయుటకై కాలస్వరూపము నిప్పుడు తాల్చినాను. కౌరవసైన్యమునందలి యోధులు యుద్ధము చేయక పోయినను జీవించియుండజాలరు. ఆత్మస్వరూపమును తెలిసిన నీవు లెమ్ము. నీవు నిమిత్త మాత్రుడ వగుము...

శ్లో॥ తస్మాత్త్వ ముత్తిష్ఠ యశోలభస్వ
జిత్వా శత్రూన్ భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధమ్
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్.

[ అర్జునుడు దిక్కులు చూస్తాడు. యెటు తిరిగినా ధ్వనే. ఎక్కడ చూచినా ధ్వనే. ప్రకృతి ధ్వని రూపంలో కని పిస్తుంది. దానికి మారుమ్రోగుతాడు అర్జునుడు........]

అర్జు : కృష్ణా, కృష్ణా, ఎక్కడ నీవు? ఎక్కడ పడితే అక్కడే నీవు వున్నట్లున్నావు. అన్నిటా నీవే! కాని ఎక్కడో!! ఒక్క క్షణం అన్నిటా నీవే! ఒక్క క్షణం యెక్కడా నీవు లేవు!! ఉండటానికీ లేకపోవ టానికీ కూడా భేదం లేదా కృష్ణా!!? ఉండటమే లేకపోవటం, లేకపోవటమే వుండటమూనా కృష్ణా!! చెప్పు. తక్షణం చెప్పు నే నీ బాధ యిక భరించ లేను. బావా!! (వెర్రిగా, హృదయ విదారకంగా కేక వేస్తాడు.)

[ బిగ్గరగా సంగీత ధ్వనులు; ఆకాశాన్నుంచి శ్లోకం ]

శ్లో॥ యచ్చాపి సర్వ భూతానాం
బీజం తదహ మర్జున,
న తదస్తి వినా యత్స్యా
న్మయా భూతం చరాచరమ్.

అర్జు : ఆఁ... ఏమిటి? నా కంటికి కనపడుతున్నదంతా ఏక స్వరూపం తాలుస్తూ వుంది. అయ్యోయ్యో! ఒకటై, ఒకటై అకస్మాత్తుగా రెండుగా బద్దలైంది. అయ్యో య్యో! కృష్ణా! కృష్ణా! ఆ రెండు ముక్కలూ నీవే.

[ విశ్వరూపంలో ]

ఒకడు : హింస మానండి. దుర్మార్గాన్ని దుర్మార్గంతో యెదుర్కోకండి. భావం ముఖ్యం, శరీరం కాదు.

[ కోలాహలం. చంపండి....పొడవండి....అని కేకలు ]

ఒకడు : రండి, రండి. నాకు మరణం లేదు. ఈ లోకంనుంచి మీరు సత్యాన్ని పారద్రోలాలని చూస్తున్నారు. సత్యానికి చావులేదు. నేను మిమ్మల్ని మంచితనంతో, సహృదయంతో, ప్రేమతో స్వీకరిస్తాను రండి...

కొందరు : చూస్తున్నారేం!...ఇదే మంచి అదను. అతని దగ్గర అస్త్ర శస్త్రాలు లేవు. మనలను ఎదుర్కో- టానికి తగిన శక్తులు లేవు. అతన్ని వధించటానికి యిదే మంచి అదను.

[ కేకలు....చంపండి.....పొడవండి.....నరకండి. ]

[విశ్వరూపం బయట]

అర్జు : అయ్యోయ్యో! కృష్ణా, ఎంతపని? ఎంత దారుణం!! సత్యం కోసం అహింసావ్రతులైన వుత్తమ పురుషు లందరూ దానవుల చేతుల్లో నలిగిపోతున్నారు. లోకం వుత్తమ పురుషుల రక్తంతో కలుషితమై పోతూ వుంది. దానవులు విజృంభిస్తున్నారు. పశు బలం స్వైరవిహారం చేస్తూ వుంది. కృష్ణా, కృష్ణా. యీ విషమావస్థ నుంచి లోకాన్ని రక్షించు. మంచి తనాన్ని అందరూ గ్రహించగలిగినప్పుడుగదా నీ అహింసా వ్రతం?... అది లేనప్పుడు?...

[ ఆకాశాన్నుంచి ]

శ్లో॥ కర్మణ్యే వాధి కారస్తే
మా ఫలేషు కదా చన
మా కర్మ ఫలహేతుర్భూ
ర్మాతే సంగోఽస్త్వ కర్మణి.

అర్జు : అహో ! ఏమి మార్పు ! ఎంతలో మార్పు! ఉత్తమ పురుషులు దుర్మార్గులను ఎదుర్కొంటున్నారు. వారికి ఆసక్తి, పరాశక్తి, లేదుగనుక హృదయపూర్వకంగా యుద్ధం చేస్తున్నారు. కృష్ణా ... యదునందనా ... బావా ... చూశావా! దుర్మార్గుల దుర్మార్గం అంతమొందుతూవుంది ... పిరికి పందలై పారిపోతు న్నారు ... లోకం నిష్కంటకం అవుతూవుంది. ఆహా ! నీ వెంతవాడవు కృష్ణా ! ఎవరది? ... ద్రౌపది ! ...

[ విశ్వరూపంలో ]

ద్రౌపది : అన్నా, కృష్ణా ! నీవుకూడా నన్ను విడిచి పెట్టావా ! నీవుకూడా దుర్యోధనాదులతో రాయ బారానికి పూనుకున్నావా ? నా భర్తలు పిరికి పందలు. వారు ధర్మంకోసం పోరాడటంలేదు. అయిదు వూళ్ళకోసం, పొట్టకూటికోసం పోరాడుతు న్నారు. ఇందుకనే దుర్యోధనాదులతో సంధికి తహ తహ లాడుతున్నారు. నీవు—అన్నీ తెలిసిన నీవు— యీ పనికి ఎలా పూనుకున్నావు ? అన్నా ! యివిగో దుశ్శాసనుడు పట్టి లాగిన కురులు ... యివి ఎప్పుడు మళ్ళీ ముడిపడేది ?

శ్రీకృష్ణు : సోదరీ! ముడిపడ గలందులకే నీ కురులు విడివడి నై. ధర్మరాజు ధర్మవ్రతం ... భీముని క్రోధానలం ... అర్జునుని భ్రాతృప్రేమ ... నా రాయబారం ... అన్నీ అందుకే దోహదం చేస్తున్నవి. (త్రుటిలో మేఘాలు

ముసురుకొంటాయి. తృటిలో ఫెళఫెళార్భాటంతో పెను గాలి వీస్తుంది. లోకమే ఒక సుడిగుండంగా కనపి స్తుంది. భీభత్స, భయానక దృశ్యాలతో, ధ్వను లతో మానవుల హృదయాలు ముక్క లవుతుంటాయి. వికృత రూపంలో కౌరవులు కనిపిస్తారు. ఏకాకిగా అతి సౌమ్యాకృతితో ఒక ప్రక్క ధర్మరాజు కనిపి స్తాడు. అతను కృశించిన ధర్మమే రూపంధరించినట్లు వుంటాడు.)

దుర్యో : నాకు రాజ్యంవుంది, ధర్మరాజుకు లేదు; నాకు అధికారం వుంది, ధర్మరాజుకు లేదు; నాకు భోగ భాగ్యాలున్నాయి, ధర్మరాజుకు లేవు. అయినా లోకం అంతా ధర్మరాజునే గౌరవించింది. నే నిది భరించ లేను. ఏమైనా సరే ధర్మరాజు నాశనం కావలసిందే. ఈ తపనతో నేను బ్రతుకలేను. (హుంకరిస్తాడు. దూర ములో వున్న ధర్మరాజు యిది వినిపించుకున్నట్లు కనపడడు. అర్ధనిమీలిత నేత్రాలతో కూర్చుని వుంటాడు.)

దుశ్శాసనుడు : నా కోపం అంతా భీముని మీదే. అతని భుజబలం మీదే. చిన్నప్పటినుంచీ భీముని జయించ టానికి నేను చెయ్యని ప్రయత్నం లేదు. అయినా ఎప్పటి కప్పుడు భీమునిదే పై చెయ్యి. ఎక్కడిది భీముని కీబలం?! అది ధర్మరాజుదే. ధర్మరాజు ధర్మ కవచమే భీమునికి రక్ష. పాండవులకు రక్ష. ఆ కవచం బ్రదలు కొట్టకుండా భీముణ్ని నేనే కాదు, దేవతలు

కూడా యేం చెయ్యలేరు ! భీముని అపజయం ధర్మ రాజు నాశనంతోనే ప్రారంభం కావాలి.

[భయంకరమైన శబ్దం చేస్తాడు. ధర్మరాజు తొణకడు. అలాగే అర్ధనిమీలిత నేత్రాలతో కూర్చుని వుంటాడు.]

దుర్యో : ఏమి ధైర్యం ? ఎంత తృణీకారం! రండి. సోదరులారా ! రండి (భయంకరమైన ధ్వనులు చేసుకుంటూ అర్ధనిమీలిత నేత్రాలతో కూర్చునివున్న ధర్మరాజు మీదకు వెళ్తాడు. ధర్మరాజు వెనుక–మిగిలిన పాండవులు, శ్రీకృష్ణుడూ వెలుస్తారు.)

శ్రీకృష్ణు : భీమార్జునులారా ! మీ కోసం కాకపోతే ధర్మరాజు తన్నుతాను రక్షించుకోడు. ధర్మరాజుని అంటిపెట్టుకోకుండా ధర్మం నిలువదు. ధర్మచ్యుతి జరుగ నివ్వకండి !

భీముడు : కులపాంసనా ! దుర్యోధనా ! ఆగు. (గద గిరగిర త్రిప్పుతూ, ధర్మరాజు మీదకు వస్తున్న కౌరవుల మీదకు దుముకుతాడు. కౌరవులు అంతర్ధాన మవుతారు.)

శ్రీకృష్ణు : అర్జునా ! ధర్మరాజు యిహ లోక వాంఛలను నిలబెట్టేది భీముని క్రోధం. భీముని క్రోధానికి కార్య రూపం యివ్వవలసింది నీ శస్త్ర పాండిత్యం. ఇందులో యేది కొరవడినా ధర్మ వినాశమే ! పాప విజృంభణే!! లే. గాండీవం తీసుకో ... (సుడిగాలి హోరు.) భ్రమతో సృష్టించుకున్న శృంఖలాలను విదిలించుకో. ముందుకు చూడు ... లే ...!!

[విశ్వరూపం బయట]

అర్జు : బావా, బావా. నేను యుద్ధానికి సిద్ధం.

[నిర్మాణ విధ్వంసకశక్తి ధ్వనులు]

అయ్యో కృష్ణా! నేను చూడలేకపోతున్నాను. శరీరం ఉప్పొంగి పోతూవుంది. కండ్లు మండుతున్నవి. కృష్ణా, కృష్ణా, నిన్ను ప్రార్థిస్తున్నాను. నీ పూర్వరూపాన్ని చూపు. ఈ రూపాన్ని ఉపసంహరించు కృష్ణా. ప్రసన్నుడవుకమ్ము. నేను యుద్ధానికి సిద్ధం. దుర్యోధనాదులు యిక లేరు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ నా స్వధర్మం. స్వధర్మ నిర్వాహణకు నేను బద్ధకంకణుణ్ణయ్యాను. ఫలితంతో నాకు నిమిత్తంలేదు. ప్రసన్నుడవు కా, కృష్ణా...

[ఆకాశంనుంచి]

శ్లో॥ అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనోమే
తదేవ మే దర్శయ దేవ! రూపం
ప్రసీద దేవేశ! జగన్నివాస.

కిరీటినం గదినం చక్రహస్త
మిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో భవ విశ్వమూర్తే

[కోలాహలం తగ్గుతుండగా]

శ్రీకృష్ణు : శ్లో॥ మయాప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శిత మాత్మ యోగాత్
తేజోమయం విశ్వ మనంత మాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వం.

మాతే వ్యథా మా చ విమూఢ భావో
దృష్ట్వారూపం ఘోర మీదృ జ్మమేదమ్.
వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం
తదేవ మే రూప మిదం ప్రపశ్య.

*　　　*　　　*

(రాజ ప్రాసాదం)

ధృతరా : సంజయా ! సంజయా! అహో ! శ్రీకృష్ణపరమాత్మ దివ్యబోధనలు విని నేను ధన్యుడ నయ్యాను. నాకీ భాగ్యం నీ మూలాన లభించింది. నీవు చేసినమేలు మరువను. కృష్ణా, కృష్ణా! నాకు జ్ఞానోదయం చెయ్యటంకోసం యీ కురుక్షేత్రయుద్ధం కూర్చావటయ్యా! రాయబారం నెపంతో వచ్చి నాకు నీ విశ్వరూప సందర్శనం చేయించావు. ఈ యుద్ధం నెపంతో దివ్యబోధలు వినిపించావు. నీ దివ్యదర్శనంవల్ల, నీ దివ్యబోధల వల్ల, నా కుమారులు నామాట విని యుద్ధం మానుకోలేదనే విచారం పోయింది. నీ రాయబారమే జయిస్తే, యీ యుద్ధమే రాకుండావుంటే, యీ సదవకాశాలు నాకు ఎట్లాలభించేవి? కృష్ణా, ఎవరికి ఏవిధంగా జ్ఞానోదయం కలుగుతుందో, ఆ విధంగానే చెయ్యి. చివరకు ఎటుతిరిగీ ధర్మమే నిలుస్తుంది.

*　　　*　　　*

[యుద్ధభూమి : అర్జునుడు రథంలో కృష్ణుని పాదాలమీద పడివుంటాడు. నెమ్మదిగా కృష్ణుని పెదవుల మీద చిరునవ్వు తాండవిస్తుంది]

శ్రీకృష్ణు : బావా! బావా!...ఏమిటిది? మాట్లాడకుండా కూర్చున్నావు?

అర్జు : బావా! (నెమ్మదిగా తలపైకెత్తి ఏదో జ్ఞాపకంచేసుకుంటునట్లు చూస్తాడు)

శ్రీకృష్ణు : ఏమిటి? రెండు సేనల మధ్యకు రథాన్ని తోలమంటివి. తోలితిని. ఎందుకట్లా దిక్కులుచూస్తూ కూర్చున్నావు? ఇక నన్నేం చెయ్యమంటావు? అశ్వాలు కదను త్రొక్కుతున్నవి.

అర్జు : కృష్ణా! నీకు సాష్టాంగ నమస్కారం (మరల నమస్కరిస్తాడు)

శ్రీకృష్ణు : ఆఁ! ఆఁ! ఏమిటిది? బావా! యుద్ధం చెయ్యటానికి వచ్చిన వీరుడవు...దుర్యోధనాదులను గెలిచి ధర్మరాజుకు పట్టం కట్టవలసినవాడివి. యిదేమిటి?

అర్జు : నా అపరాధం మన్నించు కృష్ణా. నిన్ను సామాన్య స్నేహితుడిగా భావించినందుకు క్షమించు. ప్రియుడు ప్రియురాలి లోపాలను క్షమించినట్లు క్షమించు.

శ్రీకృష్ణు : ఇదేమిటయ్యా! రథచోదకుణ్ణి రథికుడు ఆజ్ఞాపించవలసిన విధమేనా యిది? చాలు, చాలు.

అర్జు : బావా! నన్నిక ఆటలు పట్టించకు. ఓ కృష్ణా! నీ అనుగ్రహంవల్ల నా అజ్ఞానం నశించింది. సందేహ

నివృత్తి అయింది. ఇన్నాళ్లూ నేనే చేస్తున్నాను అనుకున్నాను. ఇప్పుడు తెలిసింది. యికనుంచి నాలో ప్రజ్వలించే దివ్యశక్తికి సాధనంగా మాత్రమే వుంటాను. అది నాద్వారా తన ధర్మాన్ని నెరవేర్చుకొనుగాక! నేను అందుకు తగిన సాధనాన్ని అవుదునుగాక! 'నేను' అనే అహంవల్ల నేగదా; వీరు నా తాతలు, భ్రాతలు, మిత్రులు, విరోధులు అనుకోవటం జరిగింది. భగవంతుని సృష్టిని ముక్కల క్రింద చూడటం తప్పని నీవల్ల తెలుసుకున్నాను. ఒక్క తెలుసుకోవటమేకాదు. నా తత్వమే అది అయింది. ఇక నా ధర్మం నిర్వర్తించటం కంటే మిగిలిన ఆపోహాలకు తావివ్వను.

శ్రీకృష్ణు : (భుజంతట్టి) బావా! అటు ఒకసారి చూడు. కౌరవసేనలు మనలను ఎట్లా చూస్తున్నవో! "రథం కదలదేమి? మన సంఖ్యాబలంచూసి, మనలోవున్న భీష్మ, ద్రోణాచార్య, అశ్వద్థామ ఆదిగాగల వీరులను చూసి, అర్జునుడు భయపడినట్లున్నాడు" అని అనుకుంటున్నారు. దుర్యోధనుని పెదవుల మీద ఆ చిరునవ్వు చూశావా?

అర్జు : కృష్ణా! రథాన్ని పోనివ్వు. దుర్యోధనాదులు ఎప్పుడో నాశనం అయ్యారు.

శ్రీకృష్ణు : (చిరునవ్వుతో) అట్లాగే. నా దేముంది? నేనువట్టి రథచోదకుణ్ణి.

[గుఱ్ఱాల అడుగుల చప్పుడు, శంఖారావాలు, కౌరవసేనలో భేరీ వినాదాలు, కోలాహలం... కేకలు....పెడబొబ్బలు. 'అర్జునుడు' 'అర్జునుడు,' 'కృష్ణార్జునులు' కృష్ణార్జునులు' అనేపిరికిమాటలు. ]

[పాంచజన్యం పెద్దగా వినిపిస్తుంది.]

[బ్యాక్ గ్రౌండ్ లో యీశ్లోకం వినిపిస్తూవుంటుంది. అతి శ్రావ్యంగా నెమ్మదిగా మొదలై క్రమ క్రమంగా విశ్వాన్ని నింపుతుంది]

శ్లో॥ సర్వ ధర్మాన్ పరిత్యజ్య
మా మేకం శరణం వ్రజ.
అహం త్వామ్ సర్వపాపేభ్యో
మోక్ష యిష్యామి మా శుచః

— ... —

పాత్రలు:

సుబ్రహ్మణ్యం

సీతమ్మ

రామారావు

లలిత

సుబ్బారావు

# నిలబడిన పరువు

[పెద్ద మేడలోని క్రిందిహాలు. కుడిప్రక్క వొకగది, ఎడమపక్క వొక గదీ వుంటాయి. హాలులో సుబ్రహ్మణ్యం కోపంతో కాలు కాలిన పిల్లిలా తిరుగుతోంటాడు. మధ్యమధ్య కోపంపట్టలేక, చేత్తో నుదుటిమీద కొట్టుకుంటోంటాడు. సుబ్రహ్మణ్యం అయింటిఖామందు]

సుబ్రహ్మణ్యం:- ఖర్మ! చిన్నప్పుడే పెళ్ళిచేసేస్తే తీరిపోయేది కాదూ ? కట్టుబాట్లనేవి పెద్దలు వూరికేపెట్టారా ? వాళ్ళు చెప్పినట్టు నడుచుకుంటే ఎంతబాగుండేది! ఇప్పుడు నాకొంపలో చిచ్చుపెట్టింది.

[సీతమ్మ కుడిప్రక్క గదిలోనించి ప్రవేశిస్తుంది. సుబ్రహ్మణ్యం చూస్తాడు. సీతమ్మ అతని భార్య.]

సుబ్రహ్మణ్యం: ఏమే ఏమన్నా చెప్పిందా ?

సీతమ్మ: ఏం చెపుతుంది ? ఒకటే వాంతులు.

సుబ్రహ్మణ్యం: అది సరేలేవే. పేరు చెప్పలేదుటే ?

సీతమ్మ: పేరా ? ఎవరి పేరు ?

సుబ్రహ్మణ్యం: వాడిపేరు. ఈ వాంతులకి కారణం ఎవడో, నేను ఈ ఏడవడానికి కారణం ఎవడో – వాడిపేరు.

సీతమ్మ : అదో పక్కన వూపిరాడకుండా కొట్టుకుంటూ వుంటే ఏమిటండీ కనుక్కునేది? అసలింతకీ... ... ...

సుబ్రహ్మణ్యం : ఇంకెంత జరగాలంటావ్ ? పరువూ, మర్యాదా, పోయినతరువాత–నే బతికేం, చచ్చేం ?

వెళ్ళు, ముందు వాడిపేరు కనుక్కో. చెప్పిందా, చెప్పింది; లేకపోతే దాన్నీ, నిన్నూ ఇంట్లోంచి తరిమేస్తా - అంతే. పో.

[సీతమ్మ విచారంగా కుడిప్రక్క గదిలోకి వెడుతుంది. ఎడమప్రక్క గదిలోంచి రామారావు ప్రవేశిస్తాడు. రామారావు సుబ్రహ్మణ్యం బావమరది.]

సుబ్రహ్మణ్యం : ఏరా, రామూ! ఏమన్నా తెలిసిందా ?

రామారావు : కొద్దిగా తెలిసింది బావా.

సుబ్రహ్మణ్యం : ఏమిటి ? ఏం తెలిసింది ? చెప్పు-

రామారావు : మన తోటమాలి చెప్పాడు. లలిత సాయంకాలం రోజూ తోటలోకి షికారు వెళ్ళేదట. అదే సమయానికి ఒకకుర్రవాడు వచ్చేవాడట. ఇద్దరూ ఏవో గుసగుస లాడుకునే వారట. ఒక్కొక్కరోజు చీకటి పడ్డతరువాత కూడా -

సుబ్ర : ఎంతపని చేసింది ! రామూ ?

రామా : ఏమిటి, బావా ?

సుబ్ర : వాడిపేరు కనుక్కున్నావా ?

రామా : తోటమాలి, పేరు తెలియ దన్నాడు బావా. సన్నగా యెర్రగా వుంటాడుట——

సుబ్ర : సన్నగా, ఎర్రగానా... సన్నగా, ఎర్రగానా... ... సన్నగా, ఎర్రగా... ఎవడై వుంటాడు, రామూ ?

రామా : ఇంకెవడూ ? వాడే.

సుబ్ర : ఎవడూ ?

రామా : వాడే బావా-సుబ్బారావు!

సుబ్ర : ఆ సుబ్బారావా !

సీతమ్మ : (కుడిప్రక్క గది గడపలోనుంచి) సుబ్బారావే అటండీ.

సుబ్ర : సుబ్బారావే! ...సుబ్బారావే ! !

సీతమ్మ : వాళ్లూ, 'మేం ప్రేమించుకుంటున్నాం; వివాహం చేసుకుంటాం' అని అడిగినప్పుడు మీరు వొప్పుకుంటే మన కీ అగచాట్లుండేవి కాదుగదండీ. అప్పుడేమో మీరు కాదూ కూడదని కొండెక్కి కూర్చుంటిరి. నే నెంత మొత్తుకున్నా నా మాట విన్నారా ? చిలకా గోరింకల్లా వాళ్ళు కాపరం చేసుకుంటూ వుంటే చూసి సంతోషించే ప్రాప్తం లేకపోయింది మనకి. (కంటతడి పెట్టుకుంటుంది)

సుబ్ర : ఏమిటా వేషాలు ? ఇదొకటి చేతనవు నంతే. చీటికి మాటికి కంటతడి పెట్టటం. ఏం, ఏం చెయ్యమంటావ్ ? దమ్మిడీ లేని వెధవకి నా కూతు రిన్మమ్మంటావా ? నా పరువేమిటి, నా మర్యాదేమిటి, వాడికి నా కూతు రిన్వటమేమిటి ?

సీతమ్మ : వాళ్ళిద్దరికీ ఇష్టమైనప్పుడు మన కెందుకు చెప్పండి? మనకైనా యెందరున్నారు గనక ? మన ఆస్తి అయినా వాళ్ళకి చెందేదే ఆయెను - ఇక పరువూ మర్యాదా అంటారా ? ఎవరికుండే పరువు - మర్యాదలు వాళ్ళ కుంటాయి.

రామా : నిజమే, బావా! ఇప్పటి కింకా మించిపోయింది లేదు. వాళ్ళిద్దరికీ పెళ్ళి చేస్తేనే మళ్ళీ వూళ్ళో తలెత్తుకు తిరుగుతాం. లేకపోతే యిక యీ వూళ్ళో బ్రతకలేం బావా.

సుబ్బ : మీరు వెయ్యి చెప్పండి, లక్ష చెప్పండి. ఆ వెధవకి మాత్రం నేను పిల్ల నివ్వను. వాడికి పిల్ల నిచ్చిందాని కంటే, పీక నొక్కితే నయం.

సీతమ్మ : ఏం మాటలండీ అవి ?

సుబ్బ : కాకపోతే—

సీతమ్మ : నా మాట వినండి.

రామా : పరువు నిలబెట్టు బావా.

సీతమ్మ : నలుగురి నోళ్లల్లో పడకుండా చెయ్యండీ.

రామా : పరిస్థితు లాలోచించు, బావా.

సీతమ్మ : నామాట వినరూ ?

రామా : తప్పదు బావా.

సుబ్బ : నన్నేం చెయ్యమంటావురా ?

రామా : ఒప్పుకో బావా. ఇంత జరిగినతరువాత అవీ, ఇవీ అని పెట్టుకు కూర్చుంటే లాభంలేదు.

సుబ్బ : చూస్తూ చూస్తూ, ఎలా ఒప్పుకొనేదిరా ?

రామా : ఏంచేస్తాం బావా, చెప్పు ? రోజు లలావచ్చాయి. ఇప్పుడు పెళ్లిచెయ్యకుండా లలిత నింట్లో పెట్టుకు కూర్చుంటే, సంఘం బతకనిస్తుందా ?

సీతమ్మ : ఊళ్లో పొక్కకముందే జరిగిపోనివ్వండి అమ్మాయి జీవితం అంతా మనకివడి ఏడుస్తూంటే, ఎలా సహించగలం చెప్పండి?
ఆ అబ్బాయికైనా డబ్బు లేదన్నమాటే గానీ, చదువూ సంధ్యా వున్నవాడు.
మొన్న తులశమ్మ కూతురుకని ఏమయిందో చూశారండి — బలవంతంగా ఎవరికో కట్టబెట్టాలని తండ్రి పట్టుబడితే, నూతిలోపడి ప్రాణాలు తీసుకుంది.

[సుబ్రహ్మణ్యం ఆలోచిస్తూ కూర్చుంటాడు; విచారంతో క్రుంగిపోతుంటాడు ]

రామా : ...మరో దారి లేదు.
సీతమ్మ : ...సుఖపడతాం.
సుబ్ర : అయితే మీ ఇష్టంవచ్చినట్టే తగలడండి. మీ అందరికీ ఇష్టమైతే నేకాదంటం ఎందుకు?
రామా : భేష్ బావా భేష్!
సీత : అమ్మయ్య, ఇప్పటికి గండం గడిచింది.
రామా : ఈ గౌరవం బావకే దక్కాలి.
సుబ్ర : సరేలేరా, ఇక జరగాల్సిందేదో ఆలోచించు.
సీతమ్మ : అబ్బాయ్ నువ్వెళ్లు. వెళ్ళి, బావ రమ్మంటున్నారని ఆయన్ని తక్షణం తీసుకురా.
రామా : ఆ!
సుబ్ర : రాముడూ, ముందే యీ సంగతులన్నీ చెప్పేవు; చెట్టెక్కి కూర్చుంటాడు. ఇక్కడికి తీసుకురా. తీసుకొచ్చిన తరువాత సమయాన్నిబట్టి మాట్లాడదాం.

రామా : అలాగే, బావా. నాకుమాత్రం తెలియదూ. వెళ్ళొస్తా. (సుబ్బారావుని తీసుకురావటానికి వెడ తాడు. కుడిప్రక్క గదిలోనించి లలిత ప్రవేశిస్తుంది–వయస్సు పదహారు సంవత్సరాల ఆరు నెలలు, కోలమొహం, సోగకన్నులు, క్రింది పెదవు ఎర్రగా ఉంటుంది. ఆకారంలో, నడకలో, మాటలో, తీరులో బాధపెట్టే ఆకర్షణ ఉంటుంది)

లలిత : నాకీ పెళ్ళొద్దే అమ్మా.

సుబ్బ : ఏమిటి !

లలిత : నా కీ పెళ్ళొద్దంటున్నాను.

సుబ్బ : ఒద్దూ ? ఏ మొహం పెట్టుకుని మాట్లాడుతు న్నావు ? నీ ఇష్టమే అనుకున్నావేం ? వొద్దకపోతే కాళ్ళూ, చేతులూ కట్టి మరీ చేస్తాను. నా పరువు తీసేద్దామనుకున్నావా?

సీతమ్మ : ఊరుకో, అమ్మా. నాన్నగారి మాట విను. పెద్ద లికి ఎదురు చెప్పకూడదు.

లలిత : ఓక్ (వాంతిచేసుకోబోతుంది)

సుబ్బ : శ్రీహరీ తీసుకువెళ్ళవే, లోపలికి తీసుకువెళ్ళవే.

సీతమ్మ : రా అమ్మా రా. గదిలోకి వెడదాం.

లలిత : ఓక్. అయ్యో ఓ ఓ ఓ ఓ ఓక్.

సీతమ్మ : ఏం అమ్మా, కళ్ళు తిరుగుతున్నాయా ?

లలిత : అయ్యో, అయ్యో, అయ్యో. (ఆయాసపడుతుంది)

సీతమ్మ : అయ్యో తల్లీ పద.

[సీతమ్మ కుడిప్రక్క గదిలోకి కూతుర్ని తీసుకుని వెడుతూండగా, రామారావు సుబ్బారావుతో ఎడమ ప్రక్క గదిలోనుంచి ప్రవేశిస్తాడు. లలిత వొక్కసారి సుబ్బారావు కేసిచూసి గదిలోకి వెళ్ళిపోతుంది. సీతమ్మ అక్కడేఆగిపోతుంది]

సుబ్బా : నమస్కారమండీ.

సుబ్ర : న-మ-స్కా-రం.

సుబ్బా : నన్ను రమ్మని కబురు పంపించారుట. ఎందుకో తెలుసుకుందామని వచ్చాను.

సుబ్ర : అవును ... పంపాను ... నీతో ... మీతో ... నీతో ... చెప్పరా, రామూ.

రామా : మరేమీ లేదండీ. ఈ నెల్లో లలితకి పెళ్ళి చెయ్యాలని అక్క పట్టుపట్టింది. బావకూడా ఒప్పుకున్నాడు. ముందు మీతో చెప్పి మరీ ఆ ప్రయత్నాలు చేసుకుందామని ...

సుబ్బా : నా కెందుకు చెప్పటం?

రామా : మీ రిదివరకు బావ నడిగారుట. అప్పుడేమో 'ఇప్పుడేం తొందరలే' అని బావ వుపేక్ష చేశాడు.

సుబ్బా : ఇప్పుడు మాత్రం యేం తొందరొచ్చింది ?

రామా : ఎప్పటికయినా లలితని ఒక యింటిదాన్ని చెయ్యాల్సిందే చూడండి. అందుకని ఇదివరకు అడిగివున్నారు గనుక ...

సుబ్బా : ఒకప్పు డడిగిన మాట నిజమే. కాని యిప్పు డా అభిప్రాయాలు మార్చుకున్నాను. మీ బావగారు, 'సంపాదన లేనివాడికి పెళ్ళేమిటి' అన్నారు. ఆయన

మాటలు నాకు నచ్చాయి. అందుకని సంపాదన మొదలు పెట్టేవరకు పెళ్ళి చేసుకోవద్దని నిశ్చయించుకున్నాను

సుబ్బ : ఆఁ. పెళ్ళి చేసుకోవూ ???

సుబ్బా : మీరు చెప్పిందే కాదండీ.

సుబ్బ : అయితే ? ఇప్పుడు ... ఇప్పుడూ ...

రామా : నువ్వూరుకో బావా. (సుబ్బారావుతో) చూడండీ. ఈ విషయంలో మీరలా అనుకోనక్కరలేదు. ఎందుకంటే, మా బావ ఆస్తి అంతా యెలాగా మీదే అవుతుంది; మీరు సంపాదిస్తే యేం ? సంపాదించకపోతే యేం ? బావ మట్టుకు కూతురికే పెట్టుకుంటాడు గాని—

సుబ్బా : పోనీ, అలగైతే మీరు చేసుకో కూడదూ ?

రామా : నేనా !

సుబ్బ : రామ, రామ. ఏం ఖర్మ వచ్చి పడిందిరా.

సుబ్బా : ఏం, నష్టేముంది. అక్క కూతురు. (రామారావుతో) మీ అమ్మగారు పోయేటప్పుడు 'అమ్మాయీ మీ అమ్మాయిని తమ్ముడికిచ్చి పెళ్ళి చేస్తావుకదూ' అని చేతిలో చెయ్యి వేయించుకు పోలా ?

సీతమ్మ : అలాంటి దేమీ జరగలేదు నాయనా.

రామా : అసలు లలితకి నేనంటే ఇష్టమే లేందే.

సుబ్బా : ఆమె ఇష్టాన్ని మీ రెప్పటినించి పాటిస్తున్నారండీ?

రామా: అంతాలలిత ఇష్టమే—లలితకి మీరంటే ఇష్టం. అక్కకీ, బావకీ మీరంటే ఇష్టం. వాళ్ళ ఆస్థియావత్తూ—

సుబ్బా : ఎప్పటిమాటలో, ఇప్పుడెందుకులెండి.

సుబ్బ : ఎప్పటిమాటలో కాదు, అబ్బాయీ! పెళ్ళినాడే అయిదు వేల రూపాయిలు సమర్పిస్తాను.

సుబ్బా : అయిదువేలా? అబ్బే, ఒక కుటుంబానికి అయిదు వేలేం చాల్తాయి చెప్పండి? మీకు తెలియం దేముంది? అందులో మీ అమ్మాయిని పోషించడ మంటే మాటలా? ఒక్కతేపిల్ల అవటంవల్ల బహుశా సుకుమారంగా పెంచారా ...

లలిత : (గదిలోంచి) ఓక్ ఓ ఓ ఓ ఓ ఓక్.

సుబ్బ : పదివే లిస్తాను.

సుబ్బా : ఆ, ఎందుకొచ్చిందిలెండి. మీరన్నట్లు, స్వహస్తాల మీద బతకాలిగాని, ఇతరులడబ్బుకోసం ఆశించటం మంచిదికాదు.

రామా : ఇతరుల డబ్బెలాగౌతుంది, మామగారిది?

సీతమ్మ : అవును నాయనా, మా అమ్మాయిని నీచేతుల్లో పెట్టాక, నువ్వుమాకు ఇతరుడవు ఎలా అవుతావు; మేం నీకు ఇతరుల మెలా ఔతాం?

సుబ్బా : ఎంతైనా నలుగురు పిల్లలు పుట్టుకొచ్చారంటే పదివే లేంచాల్తాయి చెప్పండి. ఇలా గేవుంటే ఏ చిక్కూ లేదు.

సుబ్బ : ఉష్ భగవంతుడా!!

లలిత : (గదిలోంచి) ఓక్ ఓక్. అయ్యో......

సుబ్బా : ఇప్పుడలాగే అంటారు. తీరా పెళ్ళయింతరువాత ఇవ్వలేకపోతే, నేనూ, నా భార్యా, నా పిల్లలూ

దరిద్రం అనుభవించలేక ...అమ్మయ్యో అది తల్చు
కుంటేనేం గుండె పగుల్తోంది.

సీతమ్మ : (ఆదుర్దాగా) తల్చుకోకు నాయనా, అలాటిం
అఘాయిత్యాలు తల్చుకోకు. మేం మాత్రం మీా కెం
దుకు లోటుచేస్తాం?

సుబ్బా : ఎందుకొచ్చినవి లెండి, ఇవన్నీని. నా బతుకేదో
నే బతుకుతున్నాను. నన్ను వెళ్ళనివ్వండి, ఇదంతా
ఎవరన్నా వింటే డబ్బుకోసం బేరం చేస్తున్నానని
కూడా అనుకోగలరు.

లలిత : (గదిలోంచి) ఓక్ ఓక్ ఓక్ ఓక్ ...అయ్యో!!...
అయ్యో !!!

సుబ్రహ్మణ్యం : అబ్బాయి, నామాటవిను. నేనలాంటివాణ్ణి
కాదు. మాటంటే చెల్లించుకు తీరుతాను. పెద్దవాణ్ణి
చెబుతున్నాను. నామాట విను.

సీతమ్మ : విను నాయనా ఆ తోటకూడా మీాకే రాసిస్తారు.

సుబ్బా : ఆఁ, మాటలవల్ల ఏం ప్రయోజనం చెప్పండి.

సుబ్రహ్మణ్యం : నీకంత నమ్మకం లేకపోతే ఇప్పుడే ఇస్తాను.
మాటనటం వొకటీనీ, పనిచెయ్యట మొకటీనా?
ఇదిగో చెక్కు రాస్తాను. (డ్రాయరులోంచి చెక్కు
పుస్తకం తీసి, దస్కతుపెట్టి సుబ్బారావుతో) ఇంద.
ఇదుగో.

సుబ్బా : (చెక్కుతీసుకుని చిరునవ్వు నవ్వుతూ) లలిత ఏది?

సుబ్రహ్మణ్యం : లలిత ఎందుకు? అది నేచెప్పింది కాదం

టుందా ? 'సరే, నాన్నా, నీ ఇష్టం' అంటుంది. దాన్నడిగే దేముంది ?

సుబ్బా : లలితా ! లలితా !

సీతమ్మ : అమ్మాయ్ ! అమ్మాయ్ !

లలిత : (గదిలోంచి) ఆఁ, వొస్తున్నా. (ప్రవేశిస్తుంది.)

సుబ్రహ్మణ్యం : లలితా, నీపెళ్ళి నిశ్చయం చేశాను —

లలిత : నీయిష్టం నాన్నా.

సుబ్రహ్మణ్యం : నే చెప్పలా? అంతే, అదెప్పుడూ నామాట కాదనదు.

సుబ్బా : లలితా, మీ నాన్నగారు, మన పెళ్ళికి పదిహేను వేల రూపాయలచెక్కు ఇచ్చారు. పెళ్ళికి ముందు వుద్యోగం సంపాదించుకో నక్కర్లేదన్నారు. ఏమం టావ్?

లలిత : నాన్నగారి సంగతి నాకు తెలుసు. ఆయనహృదయం బహువిశాలం.

సుబ్బా : అవును. ఉదార స్వభావులు.

రామారావు : ఇంక నేవెళ్ళి ముహూర్తం పెట్టించుకొస్తాను. ఏం, బావా?

సుబ్రహ్మణ్యం : ఒరే, సాధ్యమైనంత దగ్గర్లో పెట్టించాలి సుమా !

రామారావు : అలాగే. (వెడతాడు.)

సుబ్బారావు : ముహూర్తం ఎప్పుడుపెట్టినా, పెళ్ళికి ఆట్టే

ఆర్భాటం చెయ్యకుండా ఖర్చు తగ్గించి, మిగిలినడబ్బు మాకిస్తే చాలా సంతోషిస్తాం. సెలవు ...... వెళ్ళొస్తామండి, అత్తగారూ...... లలితా, రా. (ఇద్దరూ రెండడుగులు వేస్తారు.)

సీతమ్మ : (భర్తతో) మళ్ళీ తోటలోకి షికారు వెడుతున్నా రనుకుంటాను.

[ఈ మాట విని లలిత, సుబ్బారావు
బిగ్గరగా నవ్వుకుంటూ వెళ్ళిపోతారు]

సుబ : అదేమిటే! ఆ నవ్వులేమిటే! దాని వాంతులన్నీ ఏమైపోయాయే ?

సీతమ్మ : పోసిద్దురూ. అలా చెయ్యకపోతే, మీరు పెళ్ళికి ఒప్పుకోరని చేసివుంటారు.

సుబ : ఆఁ!! ఏమిటీ? చూడు ఏంచేస్తానో !

సీతమ్మ : ఏమిటీ చేసేది ? జరిగిందేదో జరిగింది. ఇకనైనా సుఖంగా బతుకుతాం. మెదలకుండా ఊరుకోండి.

సుబ : ఓసి, భడవా పదిహేనువేలు కాజేశాడే.

సీతమ్మ : ఈ ఆస్తి అంతా వాళ్ళదైనప్పుడు తీసుకుంటే మాత్రం ఏంపోయిందీ? మన అమ్మాయి సుఖంగా వుంటే అదేచాలు. ఆ కుర్రవాడైనా మంచివాడేనని అంతా చెపుతున్నారు.

[సుబ్రహ్మణ్యం ఆలోచనలో పడతాడు. భర్తస్వభావం తెలిసిన సీతమ్మ ఇక పరవాలే దనుకొని ఇంట్లోకి వెళ్తుంది........]

—•••—

## పాత్రలు :

బ్రహ్మయ్య
శరభయ్య
వీరయ్య
ఆచార్యులు
వెంకడు
కామేశ్వరరావు
గుడ్డివాడు
మనుమడు
జానకి

ఒకమాట :

[ఇదికూడా రేడియోద్వారా ప్రచారం కాబడిన నాటికే. ఆ ప్రదర్శనంలో బ్రహ్మయ్య పాత్రను నేనూ, జానకి పాత్రను ప్రముఖ సినిమానటి జూనియర్ శ్రీరంజనీ నటించాం.]

# రచ్చబండ

[రచ్చబండ దగ్గరతీరికగా వున్నప్పుడల్లా పోగయి ఉబుసుపోకకు గ్రామ ప్రజలు కబుర్లు చెప్పుకుంటూ వుంటారు.

సాధారణంగా రచ్చబండ, గ్రామం మధ్య నాలుగు బజార్లు కలిసిన చోట వుంటుంది. శరభయ్య, వీరయ్య రచ్చబండమీద కూర్చొని కబుర్లు చెప్పుకుంటూ వుంటారు.

ఒక గుడ్డివాడు పాడుకుంటూ ప్రవేశిస్తాడు. మనుమడు కర్రపుచ్చు కొని దారిచూపుతూ ముందు నడుస్తుంటాడు.

ఎదురుగా శివాలయం వుంటుంది. గుడ్డివాడు శివాలయం ముందున్న స్థలాన్ని కర్రస్పర్శతో గుర్తు తెచ్చుకొని ఆగుతాడు.]

మనుమడు : తాతా!

గుడ్డివాడు : ఏం బాబూ?

మనుమడు : గుడి దగ్గిరసా వచ్చాం తాతా.

గుడ్డివాడు : [జాలిగా] ఏం గుడో! ఏం బగమంతుడో!! [గుటకమింగి] శివ్వయ్య దేవుడా దణ్ణం ... నువ్వుకూడా దణ్ణంపెట్టుకో బాబూ.

మనుమడు : [అలవాటుగా] దేముడా దణ్ణం.

గుడ్డివాడు : ఇక ఎల్దాంరా బాబూ. ఇవ్వాళ ఉత్తరపీది ఎల్దాం. పొద్దున్నే ఎత్తే 'గుడ్డిచచ్చినోడా, అప్పుడే తెల్లారిందా!' అంటారు. పొద్దెక్కి ఎత్తే 'కుండలు తొలిపేశాం, పోగా - గుడ్డి నీ జిమ్మడతియ్యా!'

అంటారు. ఎల్లాం రా బాబూ. ఎవళ్ళేమన్నా మన కెట్టా తప్పుద్దీ? [పాట అందుకుంటాడు]

కళ్లులేని కబోదిని నారాయణా!
కాసి రచ్చించండి నారాయణా!!

మనుమడు : తాతా!

గుడ్డివాడు : [పాట ఆపి] ఏం బాబూ?

మనుమడు : దేవుడికి దణ్ణం పెట్టుకోటం ఎందుకు తాతా?

గుడ్డివాడు : ఆయన మనల్ని పుట్టించాడు.

మనుమడు : అందర్నీ?

గుడ్డివాడు : ఆఁ. సుష్టి అంతనీ ఆయనే సేశాడు.

మనుమడు : నన్నో!

గుడ్డివాడు : నిన్నూ నూ.

మనుమడు : మరి సావుకారు బెమ్మయ్యనో!

గుడ్డివాడు : ఆయన్నినీ.

మనుమడు : మరి నిన్నో!

గుడ్డివాడు : నన్నూ నూ. [నిట్టూరుస్తాడు]

మనుమడు : సావుకారు బెమ్మయ్యకి కళ్ళిచ్చి మా తాతకి కళ్ళివ్వాలా దేముడు.

గుడ్డివాడు : అయ్యయ్యో, అట్టా అనొద్దు.

మనుమడు : అంటే యేం!

శరభయ్య : [అంతకుముందునుంచీ వింటూ] అంటే ఏం ఆ? లేని కళ్లు ఎట్లాగూ రావు. ఇప్పుడు పొట్టకు దొరికే

నాలుగు మెతుకులు కూడా దొరక్కుండా పోతై...
తెలిసిందా !

తాత : ఏదో తెలియక కూశాడుకే బాబూ... పద బాబూ
పద... ...ఎప్పుడో సేసుకున్నాం; ఇప్పుడు అనబ
గిస్తున్నాం. అదిశానా... పద.

కళ్లు లేని కబోదిని నారాయణా !
కాసి రచ్చించు నారాయణా !!
దిక్కు లేని ఆక్కుపచ్చిని నారాయణా !
ముద్దేసి బతికించు నారాయణా !!

[పిల్లవాడు కర్ర పట్టుకొని దారి చూపగా
గుడ్డివాడు పాడుకుంటూ వెళ్తుంటాడు.]

శరభయ్య : వింటున్నావా, వీరయ్యా, ఆ కుర్ర వెధవ
మాటలు ? వేలెడు లేడూ, మాటలు చూడబోతే
కోటలు దాటుతున్నయి.

వీరయ్య : అసలు ఈరోజుల్లో పుండు పుట్టటం పుట్టడం పిల్ల
లకే పుడుతూవుంది. పుట్టి భూమిమీద పడ్డకాడనుంచీ
చెడు ఆలోచనలే... ఒకడి కేదో వుందని ఏడుపే.

శరభయ్య : అంతే ఈరయ్యా, అంతే... కలికాలం... మన
పెద్దలు చెప్పనే చెప్పారు, వెంపలిచెట్టుకి నిచ్చెనవేసే
వాళ్ళు పుడతారని. అడుగో బ్రహ్మయ్యగారు వస్తు
న్నారు.

వీరయ్య : పొద్దున్నే స్నానంచేసి, దేముడు దర్శనం చేసుకుని
వస్తున్నాడు. జ్ఞాపకంవుందా శరభయ్యా ?

శరభయ్య : లేకేం?... నమస్కారం బ్రహ్మయ్యగారూ...

బ్రహ్మయ్య : [ప్రవేశించి] ఓ! నువ్వా శరభయ్యా!!... తీరిగ్గా కూర్చున్నావేం?

శరభయ్య : తీరికే మరి... ఉన్న నాలుగుఎకరాలూ కవులుకి ఇచ్చేశానా...?

బ్రహ్మయ్య : నువ్వే అదృష్టవంతుడివి. కాలుమీద కాలు వేసుకొని మహారాజు లాగ కూర్చున్నావు. అలవాటు వొదులుకోలేక వొళ్ళు పిరుచుకోవటం తప్ప చేసుకుంటే మాత్రం మిగిలిచచ్చేది ఏమిటీ అంట!... ఎవ్వరా వేళ్ళేదీ? వెంకడేనా?... వెంకా?

వెంకడు : [ప్రవేశించి] ఏం దొరా?

బ్రహ్మయ్య : ఎక్కడికిరా? కొడవలీ గిడవలీ పట్టుకు బయలుదేరావు?

వెంకడు : మున్సబుగారి పనిలోకి దొరా.

బ్రహ్మయ్య : ఎంతిస్తున్నాడేమిటి? మాజోరుగా వెళ్తున్నావులే!!

వెంకడు : మామూలు కూలే దొరా, రోజుకి రూపాయి.

బ్రహ్మయ్య : ఓరి వీడి సిగదరగా! మున్సబు కేమన్నా పొయ్యే కాలం వొచ్చిందా ఏమిటి? రోజుకి రూపాయి కూలిచ్చి, వాడేం తింటాడూ అంట!

వీరయ్య : వాడివ్వకేం చేస్తాడు బ్రహ్మయ్యా? అదనీ యిదనీ అలకా జనాన్ని కదదోసి, ఎట్లా లేదన్నా రోజుకి

నాలుగు బిళ్ళకుడుములన్నా కళ్ళ జూస్తాడా, వాడి సొమ్మేం పోయింది? ఎంతన్నా యిస్తాడు.

శరభయ్య : కలికాలం. మన పెద్దలు చెప్పనే చెప్పారు, ధర్మం నాలుగో పాదాన నడుస్తుందని !

వెంక : దొరలు అట్లా అంటారుగాని, ధాన్యానికి ధర పలికే టప్పుడు ఇవ్వకపోతే యింకెప్పు డిస్తారు ?

బ్రహ్మ : ఏమిటీ ? ధాన్యానికి ధర పలుకుతూ వుందీ ! ఎవ్వడ్రా నీకు చెప్పింది ? ఒకవేళ పలికిందే అనుకో; పలికిందని పారబోసుకోమంటావా ? ఊః—ధర పలుకుతూ వుందట, ధర !! ధర పలకటం మాకలేటే కన బడుతూ వుందిగాని, ఖర్చు యెంత పెరిగిపోయిందో మీ కేమన్నా తెలుస్తూవుందా అంట !!

వెంక : ఖర్చు ఖర్చు అంటారుగాని దొరా, ఆ పెరిగే ఖర్చు మాకు మాత్రం పెరగలా ? మేమూం మీలాంటి మడుసులమే గందా !

బ్రహ్మ : మాటకు మాట అంటున్నావట్రా దొంగవెధవా? నీ తండ్రీ నీ తాతా నిజముల్లేనే వాదించార్ట్రా ఖామందుతో.

వెంక : దొరలు అడిగితే చెప్తాను. కాకుంటే నా కేం పట్టిందీ ? సేతులో పని వొదులుకొని నే నెందుకు వుండేవాణ్ణి......నే నేం ధనవంతుణ్ణి కానుగందా! కాలిమీద కాలు వేసుకొని నోట్లో మట్టి కొట్టుకో టానికి. (బిరుసుగా వెళ్ళిపోతాడు)

బ్రహ్మ : చూశావా శరభయ్యా, వూరెట్లా వుందో. ఒకడు వినేవాడూ, వొకడు చెప్పేవాడూ వున్నాడా? ఎవ్వడికి వాడే పెద్ద. చివ్వరికి కూలివాళ్ళ ముందు కూడా బతకలేని రోజులొచ్చినై.

శరభ : కలికాలం బ్రహ్మయ్యగారూ, కలికాల. మనవాళ్లు చెప్పనే చెప్పారు, బళ్లు ఓడలౌతాయనీ, ఓడలు బళ్ళవుతయ్యనీ.

బ్రహ్మ : మరి దీనంతకీ కారణం ఎవ్వరో గ్రహించావా?

శరభ : కాలమే కారణం...కలికాలం.

బ్రహ్మయ్య : ప్రతిదీ కాలానికి ముడిబెట్టబాకా. మన పెద సుబ్బయ్యగారి కామేశ్వ్రరావు నెరగవ్వూ, లక్ష్మయ్య కొడుకు......

శరభయ్య : ఊఁ...ఊఁ ఇంగిలీసు జంటిల్మేన్ ...

బ్రహ్మయ్య : వాడిప్పుడు అచ్చగా మాలపల్లిలో నేగా మకాం. రాత్రింబగళ్ళు వాళ్ళతో వొక కంచాన తిని, వొక మంచాన పడుకుంటున్నాడూ! ఇదేమి విడ్డూరమూ అంట! ఏం శరభయ్యా?

శరభయ్య : వాడి వాలకం చూసి నేను అప్పుడే అనుకున్నా, ఈ వూరిని వొక కొలికి తెచ్చిగాని విడవడని.

బ్రహ్మయ్య : అంతే మరీ, నీవంటివాడు మెతుకులన్నీ పట్టుకు చూడాలా? ఏం, వీరయ్య మామా, నువ్వన్నిటికీ చూస్తా వూరుకుంటావ్! మరి నీ ఉద్దేశం ఏమిటో చెప్పు.

వీరయ్య : నీకు తెలియుంది ఏముంది బ్రహ్మయ్యా ? మొన్న ఏదో ఉద్రేకం వచ్చి; మా పాలేర్ని ఇట్లా అన్నా. దానికి ఎంత కుమ్మక్కై చేశాడు ! చివ్వరికి చేసింది తప్పేనని నాచేత అనిపించిగాని ఊరుకోకపోయాడు. నా గొంతులో వూపిరి ఉండగా ఆ సంగతి నేను మరచిపోతానా ?

బ్రహ్మయ్య : అదుగదీ ! మన పాలేర్లని మనం కొట్టుకుంటే వీడికేవిరా అంట ! పోషిస్తున్నామేమో, కొట్టుకుంటున్నామేమో ! ఇవ్వాళ పాలేర్లని కొట్ట వద్దంటాడు, చూస్తూ వూరుకుంటే రేపు పెళ్ళాల్ని కొట్టవద్దంటాడు.

వీరయ్య : అదీ మొదలెట్టారు. వాడూ, వాడి మేనగోడలూ వూళ్ళో ఆడవాళ్ళందర్నీ పిలిచి మీటింగులు పెట్టి బోధలు చేస్తున్నారట.

బ్రహ్మయ్య : ఓరి వీడి సిగదరగా ! అంతపనీ చేస్తున్నాడూ! ఇక ఈ వూళ్ళో పరువుగా తలెత్తుకు తిరిగేది ఎట్లాగూ అంటా ! ఈ ఆడగుంపుకి రిమ్మతిరిగితే, రేగిన తేనెతుట్టేగదా అంటా !! ఏం శరభయ్యా, చూస్తూ వూరుకుంటే, మేస్తూ పోయేటట్టు వున్నాడే వీడూ.

శరభయ్య : అంతే. కలికాలం బ్రహ్మయ్యగారూ. కలి కాలంలో మొగుడుకీ పెళ్ళానికీ పడదనీ, తండ్రికీ కొడుక్కీ పడదనీ, తల్లికీ కూతురుకీ పడదనీ, సర్వ

మంగళం అవుతుందనీ మన పెద్దలు చెప్పనే చెప్పారు.

[ఆచార్యులు ప్రవేశం]

బ్రహ్మయ్య : ఏం ఆచార్యులూ, ఇట్లా వొచ్చావు ?

ఆచార్యులు : తమరికోసమే.

బ్రహ్మయ్య : అమ్మవారి తొడుగు మాటేనా ? ఈ సంవత్సరం తప్పకుండా చేయిద్దాం అంటినిగా. మరి నువ్వు కూడా ఏదో మహాత్యం అనో, గిహాత్యం అనో అమ్మవారికి నాల్గు డబ్బులు వొచ్చేటట్టు చెయ్యి ఆచార్యులూ.

ఆచార్యులు : ఉత్సవాలూ తొడుగులూ దేవు డెరుగు బ్రహ్మయ్యగారూ. అసలు ఈ కామేశ్వర్రావుముందు ఈ వూళ్లో ఉండగలిగితే వాటిసంగతి తర్వాత ఆలోచించు కోవచ్చు.

బ్రహ్మయ్య : ఏం, ఆచార్యులూ, ఏం జరిగిందేమిటి ?

ఆచార్యులు : ఏం చెప్పను బ్రహ్మయ్యగారూ ? ధర్మకర్తా, పూజారీ కలిసి అమ్మవారిడబ్బు పంచుకుంటున్నారనీ, అమ్మవారు చేసేది ఏమీలేక నిలువుగుడ్లువేసి చూస్తూ కూచుందనీ, వూళ్ళో పెద్ద దుమారం లేవదీశాడు.

బ్రహ్మయ్య : వీడే !!

ఆచార్యులు : ఆc ! మీ పెదసుబ్బయ్యగారి కామేశ్వర్రావే-లక్ష్మయ్య కొడుకు.

బ్రహ్మయ్య : ఓరి, వీడి సిగదరగా! ఇదికూడా మొదలు పెట్టాడూ ?

వీరయ్య : నువ్వీమాట విన్నావో లేదో బ్రహ్మయ్యా; మనం అంతాకలిసి పంచయితీడబ్బూ, కో ఆపరేటివ్ బ్యాంక్ డబ్బూ, తిమ్మిని బొమ్మినిచేసి ఫోర్జరీ పత్రాలు సృష్టించి వాటాలువేసుకొని తింటున్నామని కూడా చెబుతున్నాడట !

బ్రహ్మయ్య : [కోపంగా] ఏమిటీ? తింటే తింటామయ్యా! పని చేస్తున్నామేమో, తింటున్నామేమో!! వీ డెవ్వడు అడగటానికి? అసలు వీడి కెందుకూ అంట!!

శరభయ్య : కలికాలం......

బ్రహ్మయ్య : వీడి తండ్రేమో పండగనీ, పబ్బం అనీ నా దగ్గర డబ్బు తీసుకువెళ్తూ ఉండటమూ, వీడేమో నా మీద నిందలు ప్రచారంచెయ్యటమూ! కనబడనియ్, వీడి అంతు ఏదో తేల్చుకుంటాను.

వీరయ్య : ఇప్పుడు ఉపేక్షిస్తే తరువాత పశ్చాత్తాప పడ వలసి వస్తుంది. గోటితో గిల్లేది గొడ్డలితో తీర్చ వలసిన అవుసరం వస్తుంది. ఇప్పుడే అమీ తుమీ తేల్చుకోవటం మంచిది బ్రహ్మయ్యా.

శరభయ్య : బ్రహ్మయ్యగారు పట్టు పట్టారంటే ఉడుం పట్టే. తాడో పేడో తేల్చుకోకుండా విడిచిపెట్టడు.

వీరయ్య : అడుగో కామేశ్వరావు. వెదకబోయిన తీగె కాలికే చుట్టవేసుకుంది... అదిగో ఇటే వస్తున్నాడు, అడుగు బ్రహ్మయ్యా.

[కామేశ్వర్రావు ప్రవేశం]

బ్రహ్మయ్య: ఏంరా అబ్బాయి, ఎక్కడికి ?

కామేశ్వర్రావు : నమస్కారం బ్రహ్మయ్యగారూ. తొందర పని మీద వెళ్తూ చూడలేదు.

బ్రహ్మయ్య : అట్లాగే... అట్లాగే... దాన్దేముందిలే.

కామేశ్వర్రావు : ఏదో ఆలోచిస్తున్నట్టున్నారు ?

బ్రహ్మయ్య : ఆలోచనే... మరి ఆలోచించక తప్పుతుందా బాబూ. ఊళ్ళో పెద్దతలకాయ లన్నతరువాత కష్టం వచ్చినా, నిష్ఠురం వొచ్చినా మాకేగా !!

కామేశ్వర్రావు : ఇప్పుడు కొత్తగా ఏం జరిగింది ?

శరభయ్య : కలికాలం.

బ్రహ్మయ్య : వీరయ్యా, మరి అడుగుతున్నాడు చెప్పూ. వాడూ మనవాడే ... ఎంత చదువులు చదివినా పరాయివాడు కాదుగా. బెరుకెందుకు ? (వీరయ్య, శరభయ్య మొహామొహాలు చూసుకుంటూవుంటారు) వాడు లేనప్పుడు అవీ ఇవీ అనుకోకపోతే, ఉన్నదేదో మొహాన బ్రద్దలుకొడితే తీరిపోతుందిగా. అడుగూ...

వీరయ్య : అబ్బే, నాకేముంది అడగటానికి ? వాడిసంగతి నాకు తెలియదూ ? వాణ్ణి చిన్నతనంలో ఎత్తుకుని మోశాను. నా మెడ వాటేసుకొని 'రానంటేరాన'ని మారాం చేసేవాడు ! వాళ్ళమ్మ తెగ నవ్వేది.

బ్రహ్మయ్య : నువ్వు ఎప్పుడూఇంతే వీరయ్యమామా, వొట్టి ఇచ్చకాల మనిషివి. ఇన్నేళ్ళు వచ్చినా, మనిషి

దగ్గర మనిషి మాటలు పోనియ్యవుగదా! వాడు వచ్చె! 'ఏమిటి సంగతీ' అని అడుగుతూ వుండె! కడుపులో వున్న సంగతి చెప్పకోరాదూ?

వీరయ్య : అబ్బెబ్బె, అదేమిటి బ్రహ్మయ్యా. ఏమన్నా వుంటే అడగటానికి నాకేం భయం?

బ్రహ్మయ్య : వింటున్నావా, శరభయ్యా? వీరయ్యమామ ఎప్పుడూ ఇంతే...వొట్టి పసుకుడు మేళాం.

శరభయ్య : ఆఁ...ఆఁ... అంతే...కలికాలం!

బ్రహ్మయ్య : సరేలే... ఇందాక ఏమిటో కామేశ్వర్రావుని అడగాలంటివిగా, నువ్వేన్నా అడుగూ.

శరభ : అయ్యయ్యొ, నాకేం తెలుసు? ఎప్పుడూ యేదో వోక పితలాటం పెడుతూనే వుంటాడు—యీ బ్రహ్మయ్యగారు.

కామే : ఏదన్నా వుంటే అడగండి. మీరు పెద్దలు. మీరు అడగావచ్చు - నేను చెప్పావచ్చు.

శరభ : నువ్వు కూడా ఆయన మాటే నమ్ముతున్నావా? ఆయన సంగతి నీకు...

బ్రహ్మ : (మాటకు అడ్డువచ్చి) అబ్బే, యేం లేదురా అబ్బాయి. వీళ్లు కడుపులో యేమేమో పెట్టుకుంటారు, తీరా మొదటపడి అడగాల్సి వచ్చేటప్పటికి జర్రున జారతారు. వీళ్ళ గుణమే అంత. అంతకంటే యేమి వుంటుంది?

శరభ : ఊఁ, . కలికాలం!

వీరయ్య : పితపకాలం ! !

బ్రహ్మ : వీళ్ళది యేముందిగాని బాబూ, నా మాట విను. ఈ రోజుల్లో యెవ్వర్నీ నమ్మటానికి వీలులేకుండా వుంది. సరే, ఇక మన వూరి సంగతి చెప్పనే అక్క్లేదు. ఎదట వొకమాటా, చాటున వొక మాటా ! పెద్దవాణ్ని చెపుతున్నాను. కొంచం జాగ్రత్తగా మసులుకో నాయనా. అంతేనా శరభయ్యా ?

శరభ : అంతే, అంతే, జాగర్తగా వుంటం యెందుకైనా మంచిది.

వీరయ్య: ఎంత యింగిలీషు జన్టిల్‌మేనువైనా మా పెద్ద సుబ్బయ్యగారి లక్ష్మయ్య కొడుకువి గనక చెపుతున్నాను.

కామే : మీ మాటలు నాకు అర్థం అవటంలేదు. నేను నా శక్త్యానుసారం గ్రామానికి వుపకారం చేస్తున్నానే గాని, ఎవ్వరికీ అపకారం చెయ్యటం లేదే...

బ్రహ్మ : అంతేబాబూ, నీ సంగతి నేను యెరుగనూ ? గిట్టనివాళ్లు యేదో యేదో అంటూ వుంటారు. ఇవన్నీ లెక్కపెట్టుకోకు బాబూ. నీకు తెలియదుగాని, నీ చదువుకు అప్పూకావాలంటే యిచ్చింది యెవరను కున్నావు ? నేనే... తర్వాత నెమ్మదిమీద మీ నాన్న ఆ ఋణం తీర్చుకున్నాడనుకో.

వీరయ్య : వాళ్ల నాన్న యెక్కడా, ధర్మరాజు!

శరభ : వాళ్ళ తాత మాత్రం తక్కువవాడా ? వాళ్ళ వంశమే అంత.

బ్రహ్మ : ఇదుగో మీరు కట్టిపెట్టండి కాసేపు. ఏదన్నా విషయం మాట్లాడేటప్పుడు అడ్డు వస్తారెందుకూ అంటా !

[జానకి ప్రవేశం ]

జానకి : బావా ?

కామే : ఏం జానకీ ? బడికి వెళ్తున్నావా యేమిటి ?

జానకి : అవును బావా, ఈ పాటికి పిల్లలు వచ్చే వుంటారు! ఆలస్యం అయితే పని అనీ, పాట అనీ యెవ్వరి దారిన వాళ్ళు వెళ్తారు. అందుకని పెందలాడే బయలు దేరాను.

బ్రహ్మ : (ఎగా దిగా చూస్తూ) ఓసి నువ్వాటే పిల్లా, నేను గుర్తు పట్టలేకపోయాను. బాగా వొళ్ళు చేశావు, చాయకు తిరిగావు.

శరభ : దొరసానితల్లికి మల్లే వున్నావు.

బ్రహ్మ : అది సరేగాని పిల్లా, చేతి గాజులేవే ?

జానకి : [జంకుతూ] ఉన్నయ్ తాతా! బడికి వెళ్ళేటప్పుడు ఎందుకా అని, ఇంట్లో పెట్టి వచ్చాను.

వీరయ్య : అసలు ఇప్పటి వాళ్ళకి గాజులు పెట్టుకోవటమే మోటు లే.

శరభయ్య : కలికాలం !

బ్రహ్మయ్య : అంతేనటే పిల్లా ?

జానకి : అబ్బే, మోటేముంది తాతా! మోటని కాదు.

బ్రహ్మయ్య : చా...చా...చా...ఎందుకైతే మాత్రం, మొండి చేతులతో తిరగవొచ్చా పిల్లా? చూచిన వాళ్లు ఏమనుకుంటారు? ఈ పొట్టాల్లాంటి చేతులకి రెండు జతల గాజులు కూడా వుంటే, ఎంత లక్షణంగా వుండేదీ అంట?

జానకి : [నసుకుతూ] గాజుల దేముందిలే తాతా.

బ్రహ్మయ్య : యాఁ! అదేంమాట! ఇంత వెర్రిబాగుల్దానివి ఎట్లా బ్రతుకుతావే నువ్వు! ఏంరా అబ్బాయి, నువ్వునాన్నవు గదా; నువ్వైనా దానికీమాత్రం చెప్పక్కర్లా!

కామేశ్వర్రావు : లేదండీ. నిజం చెప్పటానికి జానకి బిడియపడుతూ వుంది. మొన్న బడి తెరవటానికి డబ్బు కావలసివచ్చి, నగలన్నీ అమ్మివేసింది.

బ్రహ్మయ్య : ఓసి నీ దుంపతెగ! ఎంత పిచ్చి కొయ్యవే నువ్వు! డబ్బుకోసం వంటిమీది సొమ్ములమ్ముకుంటారటే ఎక్కడైనా? నీకు డబ్బే కావాలంటే ఎవ్వరిని అడిగితే ఇచ్చేవారు కామా అంట!

జానకి : అదికాదు తాతా. ఏదన్నా పని ప్రారంభించీ ప్రారంభించక ముందే డబ్బు సహాయం అడిగితే ఏం బాగుంటుంది? అందుకని గ్రామానికి ఏదన్నా ఉపకారం చేసింతర్వాత అడుగుదాం అనుకున్నా.

బ్రహ్మయ్య : పోసి ఇతర్లని అడక్కపోయావ్, నన్నడగటానికే? నీ బ్రహ్మయ్య తాత చచ్చిపోయాడను

కునా్నవటే! ఏంరా అబ్బాయ్! అన్నీ తెలిసిన వాడివి నువ్వు వుండికూడా ఇట్లా చేయించావేమిటి!

కామేశ్వర్రావు : అప్పుడే ఏమయింది? మీ దగ్గరకు రావలసిన అవసరమూ ఉంటుంది. మీ అందరి సహాయం లేకుండా బడి ఎట్లా సాగుతుంది? ఒకరివల్ల అయ్యే పనా? రేపో మాపో అందర్నీ చూడక ఎట్లాగూ తప్పదు.

బ్రహ్మయ్య : అట్లాగే. అంతకంటేనా? కాని ఈ నాలుగు రోజులూ గడవనివ్వండి. ఇవి రైతులచేతులలో డబ్బులు మెసిలే రోజులుకావు బాబు. కుప్పనూర్పిళ్లు అయింతర్వాత అయితే...

శరభయ్య : ఆఁ! ఆఁ! అదే మంచి అదను.

వీరయ్య : అవునవును. అప్పుడైతేనే బాగుంటుంది.

కామేశ్వర్రావు : సరే మీ ఇష్టం వొచ్చినప్పుడే ఇద్దురుగాని, ఇందులో బలవంతం ఏముంది? అప్పటిదాకా మేమే ఏదో ఒకవిధంగా తంటాలు పడతాం.

జానకి : నేను వెళ్ళివస్తా బావా, పిల్లలు ఎదురుచూస్తూ ఉంటారు.

కామేశ్వర్రావు : నేనూ వస్తాను. అటు మాలపల్లిలో కొంచం పనివుంది.

బ్రహ్మయ్య : సరేగాని బాబూ, మీకువుండే పనులు ఎప్పుడూ వుంటై. అమ్మాయిని ఒకసారి మనఇంటికి పంపించు. మా ముసల్ది, దాన్నిచూడాలని తెగ

కలవరిస్తూ వుంది. [జానకితో] ఏమే, బొత్తిగా కీత కన్నెశావు ?

జానకి : తీరడంలేదు తాతా. ఈ బడి ఒకటి పెట్టుకు న్నామా ? రేపు తప్పకుండా వస్తాను.

కామేశ్వర్రావు : మరి సెలవు. వెళ్ళివస్తాం. [నమస్కరిస్తాడు]

బ్రహ్మయ్య : మంచిది బాబూ...

[శరభయ్య, వీరయ్య ప్రతినమస్కారంచేస్తారు, బిడియం బిడియంగా. కామేశ్వర్రావూ జానకీ నిష్క్రమిస్తారు.]

బ్రహ్మయ్య : ఊః !! వెళ్తున్నాడు సంఘసంస్కర్త! సిగ్గూ అభిమానం లేకపోతేసరి. ఊరుపట్టుకొని ఆడగుంపుని వెనక వేసుకొని తిరగటానికి ఏదోవొక వంక! ఇంకా డబ్బు కావాలంట. 'డబ్బు తేతే' అని వీళ్ళ తాత ముల్లె దాచబెట్టినట్టే అడుగుతారు. ఇచ్చే దాతఉంటే నేనూ నడుపుతా బళ్ళూ గిళ్ళూ.

శరభయ్య : కలికాలం, మన పెద్దలు చెప్పనే చెప్పారు.

బ్రహ్మయ్య : నువ్వు ఊరుకో శరభయ్యా, మాటి మాటికీ 'కలికాలం'–'కలికాలం' అని వొకటి నేర్చుకున్నావు ఎట్లాగయితేం ! వాడు రాకముందు అది అడుగుతాం, ఇది అడుగుతాం అని - తీరా వచ్చేటప్పటికి అంకిళ్లు నొక్కుకు కూర్చున్నారేం ?

వీరయ్య : అడుగుతాం అన్నది నువ్వా, మేమా ?

[శరభయ్యకూ వీరయ్యకూ తన ప్రవర్తనను గురించి కోపం వచ్చిందని గ్రహిస్తాడు : సర్దుబాటుగా ఇలా అంటాడు]

బ్రహ్మయ్య : నేనే అనుకో. (చనువుగా) ఏం మీరు అడిగితే తప్పా? ప్రతిదానికీ నన్ను బయటపెడితే మీకు మాత్రం ఏం క్షేమం అంటూ-పెద్ద తలకాయని ఆ మాత్రం కనిపెట్టి వుండకపోతే ఎట్లా!

వీరయ్య : [కోపంగా] మాకేం పట్టింది? కందకులేని దురద కత్తిపీట కెందుకు? ప్రతిదానికీ మమ్మల్ని ముందుకు నెట్టి నీ పబ్బం గడుపుకు పోతున్నావ్. ఇక ఎవ్వరి సంగతి వాళ్లు చూసుకోవలసిందే.

బ్రహ్మయ్య : అంతేనా వీరయ్య మామా?

వీరయ్య : అంతే.

బ్రహ్మయ్య : ఏం శరభయ్యా?

శరభయ్య : అంతే బ్రహ్మయ్యగారూ; మేమేమో కామేశ్వ్రరావుకి శత్రువులమూనూ, నువ్వేమో అతని శ్రేయస్సు కోరేవాడివీనా? కలికాలం... ...

వీరయ్య : మనం అతను లేనప్పుడు, అంటే అతని పరోక్షంలో కొండాలు చెప్పుకునే వాళ్లం. ఈయనేమో ఉన్నది ఉన్నట్లు మాట్లాడుకునే సత్యసంధుడు.

శరభయ్య : కలికాలం కాకపోతే చేతిగాజుల్ని గురించి ఆ ఆపసోపా లేమిటి?

వీరయ్య : అంతటితో ఆగాడా శరభయ్యా? పొట్లాల్లాంటి చేతులంట. ఆ పొట్లాల్లాంటి చేతులకు రెండుజతల గాజులుకూడా వుంటే నటా... ఆహాహా... ఏమిటో అవుతుందిట!

బ్రహ్మయ్య : కొంచం పారజూచి మాట్లాడండి. ఇది మీ మా మంచికి రాలా ?

వీరయ్య : పోసిలే. ఎవ్వరికి మంచో, ఎవ్వరికి కాదో తేలే టప్పుడే తేలుతుంది.

శరభ : కాకపోతే వూరిడబ్బంతా తినేది మీరూనూ, నిందలు మోసేది మేమూనా ?

బ్రహ్మ : శరభయ్యా, నోరు పారేసుకో బాక !

శరభ : మాలావు చెప్పొచ్చావులే...

వీర : డబ్బు తిన్నవాడివి, ఉన్నమాటంటే అంత ఉలు కెందుకు బ్రహ్మయ్యా ?

బ్రహ్మ : ఏమిటీ ! అంతా నేనే తిన్నట్టూ, మీరేమీ ఎరగ నట్టూ మ ట్లాడుతున్నారే. గ్రంథాలయండబ్బూ, పంచాయితీ పాటలమీంద వచ్చినడబ్బూ, మీరిద్దరూ పంచుకు తినలేదాఅంట ! అందులో నొక్క చిల్లి గవ్వన్నా నేను ఎరుగుదునా ?

వీర : మరి కాలవకట్టడబ్బూ, సత్రవడబ్బూ, ఊరిఉమ్మడి డబ్బూ గుటుక్కునమింగి కూర్చుంది ఎవ్వరు బ్రహ్మయ్యా ? నువ్వుకాదూ ?

బ్రహ్మ : నేను మింగానూ ? నేనామింగింది ? ఆమాట వచ్చి నాముందు అనమను, ఎవ్వడు అంటాడో ! ఎక్కడి కక్కడ లెక్కలు వ్రాసి అట్టే పెట్టాను.

వీర : నీలెక్కలు ఎవ్వరికి తెలియని లెక్కల్లే బ్రహ్మయ్యా.

బ్రహ్మ : ఏమిటీ! నా లెక్కలకే వంకపెట్ట వచ్చావ్!!
ఆఁ!!! (పళ్ళు కొరుకుతుంటాడు.)

వీర : చాల్లే, ఇక ఊరుకో! ఈవూరు నాశనానికి నువ్వు కాదూ కారణం.

బ్రహ్మ : నేనా?

వీర : నువ్వే?

బ్రహ్మ : ఆమాటకొస్తే నువ్వు...

వీర : నువ్వు.

బ్రహ్మ : నువ్వు.

వీర : [మొహంలో మొహంపెట్టి] నువ్వు ... నువ్వు... నువ్వు... ముమ్మాటికీ నువ్వు.

బ్రహ్మ : మాటలు జాగ్రత్తగా రానియ్ ...ఎవ్వరితో మాట్లాడుతూవుందీ, కొంచెం తెలుసుకు మాట్లాడు... నేనూ మీతాతల్లాంటి వాళ్ళని చూసినవాణ్ణే!!

వీర : ఇదుగో, ఇంకొక్కమాట మాట్లాడావా నీబ్రతుకంతా నడివీధిలో కడుగుతాను. నిన్నకాక మొన్న అవసరం గారి కోటయ్యకు సిమెంటు పర్మిట్ ఇప్పిస్తానని అతనిదగ్గర పైవాళ్ళకి లంచంపెట్టాలని వెయ్యిరూపాయీలు తీసుకున్నావు. [బ్రహ్మయ్య ఈమాటకు కొంచం కంగారు పడతాడు) ఇవ్వాళ మద్రాసులో వాళ్ళవాళ్ళపనులు చేసిపెడతానని రేపటిప్రయాణం ఖర్చులక్రింద వొకొక్కరిదగ్గరా వందరూపాయీల

చొప్పున వెయ్యిరూపాయిలు పోగుజేశావు. ఎవ్వరికి వారికి .వాళ్ళపనిబూదే వెళ్తున్నట్టు బూటకపు మాటలు చెప్పావు. అసలుఖర్చులు పంచాయితీ ఖర్చుల క్రింద వ్రాయించటానికి ఏర్పాట్లు చేస్తున్నావు... రాబోయే ఎలక్షన్లకి మావోట్లన్నీ ఇప్పిస్తానని చెప్పి, అయితే మేము డబ్బుమనుష్యులం అవటం చేత మాకు డబ్బు ఇవ్వటానికనే నెపంతో, కారం చేడు ఈశ్వరరావు దగ్గరనుంచి అయిదువేలు పుచ్చుకోటానికి వొకపథకం సిద్ధంచేశావు. ఇవ్వాళో రేపో ఆడబ్బుకూడా నీచేతికి వస్తుంది.

[బ్రహ్మయ్యకి క్రమక్రమేణా కంగారు ఎక్కువ అవుతుంటుంది. ఇంతలోకి కొందరురైతులు రచ్చబండదగ్గరకు వస్తుండటంచూస్తాడు]

బ్రహ్మ : ఊరుకో వీరయ్యా ! ఏమిటీమాటలు !! ఊరికే గాలి పోగుజేసి మనస్సుకి కష్టం కలిగిస్తావేమిటి ? ఏదన్నా కావలిస్తే అడగగూడదూ ? ఇంత చాటభారత మెందుకు ?

వీర : (తనలోతాను నవ్వుకుంటూ) అబ్బే నిన్ను అనాలని కాదు బ్రహ్మయ్యా. ఏదో మాటమీదమాట పెరిగి..

శరభ : అంతేవీరయ్యా... ఇవ్వాళ ఏదో అవుసరంగా వొక ఏభైరూపాయిలు కావలసి వొచ్చినై ...

వీర : వస్తయ్, శరభయ్యా. అవుసరాలు మనుష్యులకు రాక మానులకు .వస్తయ్యా ? ఆ మాటకీ వస్తే

వొక వంద రూపాయలు పంపమని పట్టణాన్నుంచి పిల్లవాడు వొక వుత్తరం వ్రాశాడు.

శరభ : మరి యిటువంటి అన్నిటికీ మన బ్రహ్మయ్యగారు వుండబట్టి సరిపోయే... లేకపోతే మనవల్ల అయ్యే పనా ?

బ్రహ్మ : ఉన్నాడయ్యా... ఈ బ్రహ్మయ్య వున్నాడు. లేడని మాత్రం నే నెట్లా అంటాను! కాని మీ రయినా నా కష్టం. కొంచం ఆలోచించవద్దూ.

శరభ : మా కష్టాలు మీరూ మీ కష్టాలు మేమూ ఆలోచించకపోతే...

వీర : ఆలోచించే బ్రహ్మయ్యా మేము చెప్పింది.

బ్రహ్మ : ఇంకొకమాట అను వీరయ్యా...వొక్కసారి వంద నీకూ, వక్షై శరభయ్యకూ అంటే...

వీర : అదే బ్రహ్మయ్యా నీ దగ్గర వుంది. ప్రతిదీ కూర గాయల బేరంలోకి దింపుతావ్ ?

శరభ : కలికాలం. మన పెద్దలు చెప్పనే చెప్పారు.

వీర : వాడేమో డబ్బు కావాలని వ్రాసే! పరాయిచోట వుంటూ వుండే!! ఎంత అవసరమో! ఇస్తే యిస్తానను, లేకపోతే లేదను బ్రహ్మయ్యా. అంతే.

బ్రహ్మ : ఇవ్వనని నే నెప్పు డన్నాను. కాకపోతే...

వీర : కాకపోతే గీకపోతే లేదు. ఈ ముష్టిడబ్బు ముందు నిన్నడిగి తేల్చుకుందాం అనిగాని, లేకపోతే కాకితో కబురు చేస్తే మున్సబు యివ్వడూ ?

బ్రహ్మ : అంతవరదాకా యెందుకులే (రైతులు దగ్గరకు రావటం చూచి) ఇస్తానన్నాగా...

శరభ : ఇస్తానంటే యిస్తార్లే వీరయ్యా. మన బ్రహ్మయ్య గారు ఆడినమాట తప్పుతారా ? ఎంత చెడ్డా యీ వూరికి తలకాయ. మన తలకాయని మనమే కాపాడు కోకపోతే యెట్లా ?

బ్రహ్మ : మరి యీ కామేశ్వర్రావు బెడద...

వీర : ఆ సంగతి మేం చూసుకుంటాంగా !

[ఉన్నట్టుండి గుడ్డివాని పాట వినబడుతుంది. పాట జరుగుతూ వుండగా అయిదారుగురు రైతులు రచ్చబండదగ్గరకు వస్తారు. గుడ్డివాడు, మనుమడు కర్ర పట్టుకుని ముందు నడుస్తుండగా పాడు కుంటూ ప్రవేశిస్తాడు]

గుడ్డివాడు :

లోకాల నేలేటి దేవుడా !
లోపలను దాగేటి దేవుడా !
మంచి కింత చోటుంచు దేవుడా !
అన్నిటిని సృష్టించు దేవుడా !
అన్నిటిని మన్నించు దేవుడా !

మనస్సులను కరిగించు దేవుడా!
బీదలను కాపాడు దేవుడా!

కలిగినోణ్ణి కరిగించి దేవుడా!
కుళ్ళుకంపు కొట్టనీకు దేవుడా!

లేనివోణ్ణి కరుణించి దేవుడా!
కుళ్ళి కుళ్ళి చావనీకు దేవుడా!

[గుడ్డివాడు పాడుకుంటూ, రచ్చబండ ముందునుంచి రెండో వీధికి వెళ్తాడు....బ్రహ్మయ్య వికలం అయిన మనస్సును చిక్కబట్టుకోటానికని యిలా అంటాడు....]

బ్రహ్మ : వెధవ... వెధవ పాటలూ వీడూనూ.

శరభ : కలికాలం బ్రహ్మయ్యగారూ, కలికాలం. మన పెద్దలు చెప్పనే చెప్పారు...

...o...

# ముగింపు

మనది ప్రతివస్తువూ పరబ్రహ్మ స్వరూపమే అని చెప్పే సం స్కారం. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అన్నంత మాత్రాన భిన్నత్వానికి చోటు లేకుండా పోలేదు. మన సంస్కారంలో, సృష్టిలో భిన్నత్వం వుంది; ఏకత్వమూ ఉంది. ఈ రెంటిలో ఏదిలేదు అనుకున్నా దృష్టి పరిమితమే అవుతుంది. అందుకనే భిన్నత్వంలో ఏకత్వం చూడ గల గటం మన మహర్షుల ఆదేశం అయింది. మనం భిన్నత్వాన్ని అంగీక రించటం ద్వారా నియంతృత్వానికి స్థానం కలుగనీయకుండా చేసుకుం టున్నాం. ఏకత్వాన్ని అంగీకరించటం ద్వారా సంఘం ఛిన్నా భిన్నం కా కుండా కాపాడుకో గలుగుతున్నాం అంటే 'నియంతృత్వం'లో వున్న అపాయాన్నీ 'ప్రజాస్వామికం'లో వున్న అపాయాన్నీ మనకు సోకకుండా వాటిలోవున్న మంచినే అనుభవంలోకి తెచ్చుకో గలుగు తున్నాం.

'భిన్నత్వంలో ఏకత్వం' అనే మన పూర్వసిద్ధాంతంలో ఇంత నవ్యత వుంది. అందువల్లే అటు ప్రజాస్వామిక ప్రభుత్వాలూ, ఇటు నియంతృత్వాలూ, ప్రపంచాన్నీ, ప్రపంచంలో వున్న విభిన్న శక్తులనూ ఏకంగా నడపగలిగిన 'సందేశం' కోసం మనదేశంవైపుకి అర్రులెత్తి చూస్తున్నయి. మన 'పంచశీల' ఈ దృష్టి ఫలితమే!

ఈ సందర్భంలో Cultural Unity అనే గ్రంథంలో గెర్ ట్రూడ్ ఎమర్సన్ సేన్ మన సంస్కృతిని గురించి వ్రాసిన విషయాలు ఉదహరించదగినవి- 'అతి సర్వత్రవర్జయేత్' అనేది పూర్వపు గ్రీసుదేశం యొక్క సిద్ధాంతం. 'భిన్నత్వంలో ఏకత్వం' గానీ 'ఏకత్వంలో భిన్న

త్వం' గానీ భారతదేశపు సిద్ధాంతం.... ఈ సిద్ధాంతాన్ని నమ్మటంవల్ల, భిన్నాభిప్రాయాల పట్ల సహనం, దానివల్లవచ్చే జవసత్వాలూ భారతదేశపు ప్రత్యేకత అయింది. అని వ్రాసింది. ఈ భావాన్నే రవీంద్రులు తమ 'సాధన' అనే గ్రంథంలో అత్యద్భుతంగా చిత్రించారు. వారు, గ్రీసు దేశంలో పుట్టి పరివ్యాప్తమైన పాశ్చాత్యసంస్కృతికీ, మన సంస్కృతికీ, వున్న భేదాన్ని ఈ విధంగా వర్ణించారు.

"గ్రీసుదేశం యొక్క సంస్కృతి పట్టణపుగోడలమధ్య పెరిగింది. ఈ గోడలు మానవుఁ మనస్సులమీద గట్టి ముద్రను వేసినవి. దీనివల్ల 'విభజించి పాలించటం' అనే దృష్టి, 'జయించి స్వాధీనపరచుకోవటం' అనేదృష్టి ప్రచారంలోకివచ్చినయి. దీనివల్ల మనకు భూదేవినీ, జ్ఞానాన్నీ, మానవుణ్ణీ, ప్రకృతినీ - అన్నిటినీ ముక్కలక్రింద విడగొట్టి చూడటం ముఖ్యలక్షణం అయింది. మనలను చుట్టుకొని వున్నగోడల అవతల వున్నజీవితాన్ని శంకించటం అలవాటైంది... మన 'ఆర్య' సంస్కృతి ఇటువంటిదికాదు, దీనికి భిన్నమైంది. అది మహారణ్యాలలో పుట్టినది. పర్ణకుటీరాలలో పెరిగినది.... మానవుని ఆదర్శం స్వాధీనపరచుకోవటం కాక, బుద్ధిని వికసింపజేసుకొని పరిసరాలతోపాటు పెరగటం అయినది.

మానవుడు, సత్యం సర్వవ్యాప్తం అని గ్రహించాడు. జీవితంలో, పూర్తిగా విడివడి వుండటం అనేది పొసగని విషయం అని గ్రహించాడు. ప్రపంచంలోని అన్ని వస్తువులలోకీ చొచ్చుకు పోవటమే సత్యసిద్ధికి మార్గం అని గ్రహించాడు. జీవాత్మనూ పరమాత్మనూ ఈ విధంగా ఏకం చెయ్యటానికే మన మహర్షులు కృషి చేశారు...."

వారింకా ఇలా వ్రాశారు:

"ప్రకృతిని లోబరచు కుంటున్నామని పాశ్చాత్యులు గర్వపడు తున్నట్లు కనిపిస్తుంది. మనమేదో విరోధి ప్రపంచంలో వున్నట్లూ, మనకు కావలసిన ప్రతిదీ దానినుంచి బలాత్కారంగా గుంజుకో వలసి వున్నట్లూ వీరు భావిస్తున్నట్లు కనిపిస్తుంది. ఇది పట్టణపు గోడలకు సంబంధించిన అలవాటు: వారు మనస్సుకి ఇచ్చిన శిక్షణనుబట్టి పుట్టినది. కాని భారతదేశం దృష్టి వేరు. మనిషితో కలిపివున్న ప్రపంచం దానికొక పెద్దసత్యం. మనిషికీ ప్రపంచానికీ వుండవలసిన సామరస్యం మీదే దాని చూపు....జయించటం కాదు దాని ఆదర్శం-సిద్ధిని పొందటం. ప్రపంచాధిపత్యం కాదు. దాని ఆదర్శం—పరిపూర్ణ మానవుడు."

మన సంస్కృతియొక్క ప్రత్యేకతను ఈ విధంగా చిత్రించుకుంటూ పోయారు రవీంద్రులు. రవీంద్రులు మహర్షుల సాంప్రదాయానికి చెందినవారు. వాల్మీకి వ్యాస కాళిదాసుల కోవకు చెందినవారు. వారి తరువాత మన సంస్కృతికి ప్రతినిధిగా రాజిల్లిన వారిలోకెల్ల శ్రేష్ఠులు. వీరి కరకమలముల స్పర్శమాత్రాన మన సంస్కృతి రమ్యాకృతిని పొందింది.

* * *

ఇటీవల ఈ మన సంస్కృతి నన్ను గాఢంగా ఆకర్షిస్తూ వుంది; నా మనస్సుని వశపరచుకుంటూ వుంటూవుంది. ఈ సంస్కృతియొక్క ప్రధాన లక్షణాలను కొన్నిటిని ఈ సంపుటిలోవున్న 'తత్వమసి' నాటికలో ముఖ్యంగానూ, కొంతవరకు 'కాల ప్రవాహం', 'విశ్వరూప సందర్శనం' నాటికల్లోనూ వ్యక్తపరచటానికి ప్రయత్నించాను. ఈ సంపుటిలోని మిగిలిన నాటికలు మామూలు నాటికలే! అంటే సంఘంలోని దురాచారాలను రూపు మాపటానికి ప్రయత్నించిన నాటిక లన్నమాట.

* * *

ఇది విప్లవయుగం. అంటే మార్పు వేగంగా రావాలని ప్రతి వొక్కరూ వాంఛించే రోజు లివి. 'మానవుని యెడల ఆసియాఖండ పూర్వదృష్టి' అనే వుపన్యాసంలో రాధాకృష్ణ చెప్పినట్లు "మనం భవిష్యత్తుని రూపొందించే కాలంలో వున్నాం. ప్రపంచం దగ్ధపటలం అవటమో, ప్రశాంతంగా నిలబడిపోవటమో ఇప్పుడు తేలవలసివుంది. పర్యవసానం మనంచేసే ప్రయత్నంమీద ఆధారపడి వుంది." ఇప్పటి రోజులు నిజంగా అపాయకరమైనవే. ఇటీవల మనం ఎవ్వరికివారం ఇతరులను బాగుచెయ్యటానికి ప్రయత్నించాం, అంతేగాని ఎవ్వరికి వారం బాగు పడటానికి ప్రయత్నించలేదు. దీనివల్ల అంతా చెప్పేవారే అయ్యారు. చేసేవారు కరువయ్యారు. దీని ఫలితంగా మానవుడు పతనం అయ్యాడు. తాను సృష్టించిన శక్తులకే తాను దాసుడు అయ్యాడు. ఈ శక్తులన్నీ నేడు భస్మాసుర హస్తాలై తన సృష్టికర్తమీదకు చెలరేగుతున్నాయి. వీటిని అదుపులో పెట్టాలంటే మానవుడు పెరగాలి. ఎవ్వరికి వారు అభివృద్ధి చెందాలి. మేధావులు మరొకసారి తమ దృష్టిని మానవునిమీద కేంద్రీకరించాలి; మానవునిలోవున్న శక్తులనన్నింటినీ విజృంభించేటట్లు చెయ్యాలి; మానవునిలోవున్న దేవత్వం బహిర్గతం కావాలి.

దీనికి మనపూర్వసంస్కృతి పూర్తిగా సహాయపడుతుంది. అందువల్ల మన పూర్వసంస్కృతి పునశ్చరణ ఈ పరిస్థితులలో ఎంతోఅవుసరం అవుతూంది...రాధాకృష్ణ చెప్పినట్లు 'నేడు ప్రపంచం, ఆధ్యాత్మిక విలువల పునరుద్ధారణ లేకపోయినట్లయితే, శాస్త్రపరిశోధనా ఫలితాల విజృంభణతో సర్వనాశనం అయ్యేస్థితికి వచ్చేది.'

ఈ దురవస్థనుంచి ప్రపంచాన్ని మనమే తప్పించగలం. అని నా విశ్వాసం. దీనికి అప్పుడే పునాదులు పడినై. ఈ బాధ్యతను నిర్వహించటానికి ప్రతి భారతీయుడూ, ఎవ్వరి శక్త్యనుసారం వారు, ఉద్యుక్తుడు

కావాలి. "మానవుడు, ప్రస్తుతం తనదృష్టిని మార్చుకునే ప్రత్యేకావస్థలో వున్నాడు. నేడు సాంప్రదాయం తనబలాన్ని పోగొట్టుకుంది. విప్లవం ఒక్క బయటివాతావరణంలోనే కాదు. మానవుల హృదయాలలోకి జొర బడి వుంది. ప్రపంచాన్ని గురించి మనం ఊహించుకున్న ఊహాచిత్రాన్ని మనం సరిదిద్దుకోవాలి. ఈ సరిదిద్దుకోవటం భక్తినీ క్రమపద్ధతినీ మానవుని గొప్పతనాన్నీ ఆధారంగా తీసుకొని జరగాలి." అన్నారు రాధాకృష్ణ ఈ నాటి ప్రపంచసంక్షోభాన్ని సమీక్షిస్తూ.

ఈ పనిచెయ్యటం ఇతరులకంటే మనకు తేలిక. దీనికి కారణం మన పూర్వసంస్కృతి. ఈ విధంగా మన పూర్వసంస్కృతి పునశ్చరణ ఈనాడు అవసరం అయింది.

—గోపీచంద్